# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 1 | రాజమహేంద్రవరము 1-9-1978 | సంచిక 21

—* ఈ సంచికలో *—

1. తత్త్వఫలము ( పద్య )
2. గురుదేవుఁడు ( పద్య )
3. చెలియలికట్ట.
4. ఆధునికాంధ్ర కవిత్వంలో జాతీయ భావన.
5. రఘునాథరాయల 'వాల్మీకి చరిత్రము'.
6. ప్రకృతి స్థానంలో 'ముసాఫర్లు'.
7. ఒక చిలుక ముక్కులో ఇరవై ఇంద్రధనుస్సులు.
8. ఎక్కువ వ్రాయని భాస్కరుడు – 'శ్రీ అజంతా'.
9. విశ్వనాథతో ఇష్టాగోష్ఠి.
10. సుఖనోభవన్తు. ( పద్య )

1—9—78 సంచికలో కన్నీటికావ్యంలో కదలించే ప్రకృతి, ఏకవీర, సోమరసం – సుందరకాండ, కద్రూవినతల ఘట్టము – కొన్ని ప్రసన్న విశేషాలు, ఆరుద్ర కూనలమ్మ పదాలు మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా
సంవత్సరమునకు రు 10-00.
అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై.

# తత్త్వ ఫలము

— శ్రీ జమదగ్ని.

దేహమనంగ దాహ్యమయి, తీవ్ర తరాధిక దాహహేతువౌ
టీహ నెఱింగి పాపపథమేగుట ఘోరకఠోర శిక్షకా
నూహ వహించి యయ్యదిఁక నుండఁగరా, దిటమీఁద నెట్టిదౌ
దేహము నందరాదనెడి దీక్షవహించెడివాఁడె ధన్యుఁడౌ॥

దాని స్వభావ మట్టిదని తత్త్వమెఱింగిన ధీరజీవి యు
ద్దాని ధరించియున్ దనకు దానికి సంగమొకింత లేక లో
లోన శివున్ దలంచుచును లూన సమస్త జగత్కలాపుఁడై
తానె సమస్తమై తనకుఁ దానె సుఖంబనిస్వాత్మమగ్నుఁడౌ॥

బొండము స్థూలమైన తనువున్ మతిలోపలి పీచు సూక్ష్మమై
యుండ ఘనీభవించి తన యుండిన చొప్పునెఱుంగనీకయు
ద్దండెడిగట్టి టెంకెయు నహో నిజకారణ దేహమై త్రినే
త్రుండయి రెండు నేత్రములె తోఁచునరుండగు నారికేళమున్॥

కొబ్బరి జీవుఁడం దెటులుకోరి వసించునొ చిత్ర, మెట్లు తా
నుబ్బెను లోన? నీరముగ నూరి క్రమమ్ముగఁ బేరి పేరి పె
ల్లుబ్బి దళమ్ముగా ముదిరి యుండిన మూట నెదేని దేనికై
దెబ్బ ఘటిల్లినన్ దనకు దెబ్బగునట్లు చలించు నిత్యమున్॥

తత్త్వ విదుండు వానిబడి తాను చలింపఁడు తాన యత్రియా
తత్త్వమెఱింగి లో మెఱఁగు దానికి వీలుగ నెండి యెండి స
చ్చిత్త్వ విశేషమౌ కురిడి చేయును లోపలి టెంకె విచ్చినన్.
స్వత్వము నందెయుండియుఁక జాఱఁడు దేహములందముక్తుఁడై॥

వాఁడు శివుండెయౌ తనకు వానికినైన యభిన్నతత్త్వమున్
పోడిమి తెల్పఁగాఁ బుడమిఁ బుట్టగఁ జేసెడి నిట్టి కాయ; నే
వాఁడు శివార్థియౌచుఁ దనువౌ నిది భేద్యము నేను నీవెయౌ
వాడిమినందఁ జేయుమని ప్రార్థనచేయుచు గుండెలిచ్చునో॥

వాఁడె దినమ్ము దేవరకు భక్తిన కొబ్బరికాయఁగొట్టి కా
పాడుము దేవ లోనెపుడు స్వచ్ఛతనుండుదు నంచు తెల్పు చే
నాఁడతఁ డాతఁడై కురిడి నాఁబురు డించునొ నాటి కత్రియై
వీడి శరీర మోపయిని వీడును సంస్మృతి ముక్తుఁ డౌటచేన్॥

( నా 'గిరి ప్రదక్షిణ మహాకావ్యము' నుండి ఉద్ధృతమైనవీ పద్యములు. )

# గురుదేవుఁడు

- డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు,
ఎం ఏ., పిహెచ్. డి.

అజ్ఞాన మనియెడు నంధకారముఁ బాపు
విమల విజ్ఞాన దీపిక యెవండు?
దరిలేని విజ్ఞాన వరుణాలయమ్మును
దాఁటించు నట్టి పెన్ తరి యెవండు?
ఉత్తరోత్తరముగా నుత్కర్ష మొనఁ గూర్చి
వృద్ధి నొందించు నిశ్రేణి యెవఁడు?
విద్యార్థిలోకమ్ము సద్యః ఫలమ్ములఁ
దనియించు కల్పపాదప మెవండు?
దారి తెన్నును లేని యెడారిలోనఁ
దిరుగు విద్యార్థి పాంథుల సరసి యెవఁడు?
బ్రహ్మ విష్ణు మహేశ్వర ప్రతిముఁ డెవ్వఁ?
డట్టి గురునకు వలవదే యంజలింప?

అదియొక వింతజ్యోతి గురుఁడన్న; నతైలమయయ్యుఁగొండయె
క్కుడ యెపుడేని; నెన్ని పెనుగాలులు వీచిన నించుకేఁ జలిం
పద; తనకంటె మిన్నగ విభాసిలు జ్యోతు లసంఖ్యముల్ పదిం
బది వెలిఁగించుఁ;దద్దశనుసుంచుట మేల్ కొడిగట్టకుండఁగన్.

సార విద్యార్థి హృదయ కేదారములను
జదువువిత్తులం మొలకెత్తి సఫలతఁ గన
స్వీయ జీవన మెల్ల వెచ్చించునట్టి
వార్షికాబ్దమ్ములను మెచ్చవలదె గురుల?

గురువరు డన్న నెవ్వరనుకొందురు బాలురు! మిమ్ముఁగన్న య
ప్పరములకంటెఁబూజ్యుడు;ధ్రువంబది;యేలన, వారలెప్పుడున్
గర మనురక్తి భౌతికముగా భవదభ్యుదయమ్ము గూర్పఁగా;
గురుఁడో భవన్మనః కమలపట్కములముల్ వికసింపఁ జేసెడున్.

గురువరుఁ డన్న నెవ్వరనుకొందురు బాలురు! లోకమందు నె
వ్వరిదగుకీర్తి నల్దెసల వ్యాప్తిని జెందిన; నెవ్వరెట్టి సు
స్థిర పద నిష్ఠులై కడు విశిష్టతఁ గాంచిన; దానికంతకున్
గురుఁడగు మూల;మాతని నపంతిత భక్తిని గొల్వఁగాఁదగున్.

# చెలియలి కట్ట

— డా. యు. శ్రీరామమూర్తి, ఎం. ఏ., పిహెచ్. డి.

చెలియలి కట్ట నవల ఉద్దేశ ప్రధానమైన రచన. వైవాహిక బంధం-ప్రేమ సిద్ధాంతం ప్రాతిపదికంగా విశ్వనాథ సత్యనారాయణగారు ఈ నవలను రూపొందించారు. ప్రేమ కారణజన్యం అనీ, అది వైవాహిక బంధరిలో సుస్థిరంగా నిలుస్తుందనీ చెలియలి కట్ట నవల ద్వారా విశ్వనాథవారు తమ ఉద్దేశాన్ని నిరూపించారు. ప్రేమకు దివ్యత్వాన్ని వాంఛాత్వాన్ని ఆరోపించి దానికి పట్టాభిషేకం చేసిన సమకాలీన చలం వాదాన్ని పరాస్తం చేయాలనే ఉద్దేశంతో ఈ నవల వ్రాయబడ్డట్లు కన్పిస్తోంది.

సముద్ర తీరంలో వున్న ప్రతిష్ఠానపురంలో సీతారామయ్య ఆర్ష సంప్రదాయం మూర్తీభవించిన నైష్ఠిక బ్రాహ్మణ సామాన్య కుటుంబీకుడు. మొదటి భార్య చనిపోతే రెండో పెళ్ళి చేసుకుంటాడు. రెండో భార్య రత్నావళి రూపసి. సీతారామయ్య తమ్ముడు రంగారావు పట్టణంలో ఉన్నత విద్యాభ్యాసం చేస్తుంటాడు. సామాన్య కుటుంబీకుడయినా ఆస్తిని పణంగా పెట్టి తమ్ముణ్ణి చదివిస్తుంటాడు సీతారామయ్య. విధవరాలయిన సోదరిని ఒక పక్క భరిస్తూ ఆమె కొడుకు చదువుభారాన్ని కూడా అతను మోయవలసి వస్తుంది తమ్ముడిమీద ఆశలు పెంపెట్టుకుని సీతారామయ్య కుటుంబభారాన్ని మోస్తుంటాడు.

అన్నగారి ఆశలను వమ్ము చేస్తాడు రంగారావు. పట్టణంలో చదువుకంటె ప్రేమ సిద్ధాంతంపై మోజు పడతాడు. దానికి జగద్రహస్య సిద్ధాంతమని పెద్ద పెద్ద పేర్లుపెట్టి ప్రేమ సిద్ధాంతాన్ని ప్రచారంచేస్తూన్న సంఘంలో ప్రముఖ పాత్ర వహిస్తుంటాడు రంగారావు అధ్యయనం చేస్తూన్న ప్రేమ సిద్ధాంతాన్ని నిరూపించదలుచుకుంటాడు. ప్రయోగ పరిశీలన సొంత ఇంట్లోనే ప్రారంభిస్తాడు. సెలవుల్లో ఇంటికి వచ్చినపుడు వదినె రత్నావళిని ఏకాంతంలో కలిసికొని ప్రేమ సిద్ధాంతాన్ని ఆమెకు వివరిస్తాడు. ముసలివాడయిన భర్తనుండి రత్నావళి సుఖం పొందలేదని, ప్రేమ వున్నచోటికి భర్తను వదిలేసి అయినా వెళ్ళిపోవచ్చనీ ఆమెకు బోధిస్తాడు. ఆమె భర్తపై అసహ్యాన్ని, తనపై వ్యామోహాన్ని కలిగిస్తాడు. ఆమె మనస్సును తనవైపు తిప్పుకుంటాడు. పుస్తకాలను కొన్నింటిని ఆమెకు పట్టణంనుండి పంపుతాడు. పుస్తకాలను చదివింతర్వాత రత్నావళిలో కొంతమార్పు వస్తుంది. మరిదిపై మనస్సు లగ్నం కావడాన్ని ఇంట్లో ఆడబిడ్డ కనిపెడుతుంది. అన్నగారితో చెప్పి రత్నావళిని కూకలేస్తుంది. భర్తకు ఎదురు తిరిగి అతనిపై చేయిచేసుకుంటుంది రత్నావళి. రంగారావు తన కుటుంబానికే ఎసరు పెట్టాడని అన్న సీతారామయ్య ఖిన్నుడౌతాడు. రంగారావు రత్నావళిని లేపికొని, ఆస్తిపంచుకొని పట్టణం వెళ్ళిపోతాడు.

పట్టణంలో రంగారావు, రత్నావళి అన్యోన్యంగా కలిసిమెలిసి తిరుగుతుంటారు. తనను వివాహం చేసుకొనమని రత్నావళి రంగారావును అడుగుతుంది. తానామెను ప్రేమించడం లేదనీ, కలిసిమెలిసి సంవత్సరం వున్నతర్వాత వివాహం ప్రసక్తి తీసుకరమ్మనీ రంగారావు ఆమెతో అంటాడు. శారీరక సంబంధం తనతో ఏర్పరచుకొన్న రంగారావు తనని ప్రేమించడంలేదని చెప్పడంతో ఆమెకు అతనిపై విపరీతమయిన కోపం వస్తుంది. పైగా తాను కొంతమంది స్నేహితులను పిలిపించబోతున్నాననీ; వారిలో ఆమెకు ఎవరు నచ్చితే వారిని చేసుకోవచ్చనీ రంగారావు రత్నావళికి చెప్పడంతో అతనిని ఆమె అర్థంచేసుకోలేక పోతుంది.

రంగారావు చెప్పినట్లే అతని స్నేహితులు ముగ్గురూ వేర్వేరుగా రత్నావళిని కవ్వించడానికి యత్నిస్తారు. వారిలో ఒకరికి ఆమె ఎడ సోదరీభావం కలుగుతుంది. వారి ముగ్గురితో చనవుగావున్నట్లు రత్నావళి నటిస్తుంది. అదిచూచి రంగారావు ఓర్చుకోలేక పోతాడు. వాళ్ళు వెళ్ళిపోయింతర్వాత అతని సిద్ధాంతంపై అతనికే నమ్మకం లేకుండా పోయిందని రంగారావును రత్నావళి దెప్పిపొడుస్తుంది. ఒక పక్క తనతో దాంపత్య సుఖం అనుభవిస్తూ మరోవైపు తనను ప్రేమించడంలేదని చెప్పుతూన్న రంగారావుమీద ఆమెకు విరక్తిభావం కల్గుతుంది తనున్న పరిస్థితికి ఆమె ఎంతో బాధపడుతుంది. 'రెంటికీ చెడిన రేవడి'గతి తనకు పట్టిందని ఆమె దుఃఖిస్తుంది. జీవితంలో అతణ్ణినమ్మి లేచి వచ్చినందుకు ప్రయోజనం లేదని తెలుసుకొని, తనకాళ్ళమీద తాను నిలబడాలనుకొంటుంది. ముకుందరావు అనే పండితునివద్ద శుశ్రూష చేస్తుంది. సంస్కృత కావ్య పఠనం, వేదాంత ధర్మశాస్త్ర అధ్యయనం చేస్తుంది. లౌకిక జ్ఞానం సంపాదించి జీవితంలో నేర్చుకున్న విద్య ఫలితాన్ని అనుభవిస్తుంది.

రంగారావు పత్రికాఫీసులో ఉద్యోగం చేస్తుంటాడు. రత్నావళిని తానిప్పుడు ప్రేమిస్తున్నాననీ ఆమెను వివాహం చేసుకుంటాననీ అంటాడు. కాని రత్నావళి అతనితో వివాహానికి ఒప్పుకోదు. తాను

ఇంకా సీతారామయ్య భార్యనే అని, అయితే ప్రస్తుతం జీవితంలో మోసపోయిన నిస్సహాయురాలినైనా నని అంటుంది అతనితో ఆమె ప్రస్తుతం వుండటానికి కారణాలు రెండు. ఒకటి అతనిపై జాలి. రెండు ఆమె నిస్సహాయత్వం అని ఆమె అతనితో చెప్పి, అతనిని తాను ప్రేమించడం లేదనీ, తనవద్ద వివాహ ప్రసక్తి తేవద్దని హెచ్చరిస్తుంది.

రంగారావు ప్రేమ సిద్ధాంతాన్ని విమర్శించి, అతని ప్రవర్తనవల్లనే తనింత అధ్వాన్న పరిస్థితికి వచ్చానని అతణ్ణి అడుగడుగునా మాటలతో రత్నావళి విమర్శిస్తూంది. వైవాహికబంధ పావిత్ర్యాన్ని వివరించి, ప్రేమ సుస్థిరంగా నిలిచేది దాంట్లోనే గాని, నిర్నిమిత్తంగా అది కలగదని చెప్పి, ప్రేమకూ వాంఛకూ గల భేదాన్ని వివరిస్తుంది. కామ ప్రవృత్తి నుండి పుట్టిన వాంఛ పశుతుల్యంఅని, ఈ వాంఛే ధర్మబద్ధమయి స్త్రీపురుషుల సంసారానికి హేతువైనప్పుడు దానిని ప్రేమ అనవచ్చుననీ, అటువంటి ప్రేమకు తామిరువురం అనర్హులం అనీ, రత్నావళి రంగారావుతో చెబుతుంది. తన పతనానికి కారణమయిన అతణ్ణి రత్నావళి మాటలతో చిత్రహింస పెడుతుంటుంది.

విద్వాన్ పరీక్ష అయి అధ్యాపకురాలుగా రత్నావళి ఉద్యోగంలో ప్రవేశిస్తుంది. అతడూ, ఆమె, ఉద్యోగం చేస్తూండటంవల్ల కొంతధనం మిగుల్చుతారు. పట్టణంలో చదువుకుంటూన్న మేనల్లుడు రంగారావుకు తటస్థపడతాడు. సీతారామయ్య పోలికలున్న అతణ్ణిచూసి భర్తే వచ్చినట్లుగా మురిసి పోతుంది రత్నావళి.

రంగారావుకు పక్షవాతం వస్తుంది. ముకుందరావుగారి సాయంతో రత్నావళి రంగారావు జబ్బు నయం చేయిస్తుంది. రంగారావుకు రత్నావళిపై మోహం పెరుగుతుంది. రంగారావుతో సుముఖంగా వుండమని ముకుందరావు రత్నావళికి చెబుతాడు. గురువుగారన్న గౌరవంతో వారి మాటలకు విలువ ఇస్తుంది రత్నావళి.

కొన్నాళ్ళకు రత్నావళికి తను అనుభవిస్తున్నది సుఖంకాదనీ నరకమనీ గుర్తొస్తుంది. తనకింక సంతానయోగం వుండకూడదని తీర్మానించుకుంటుంది. పతనమయిన తనకు సంతానం ప్రాప్తించినచో ఆ సంతానం పడబోయే హైన్యస్థితిని వూహించుకోలేక పోతుంది. ధర్మవివేకచింతన ఆమెలో ఎక్కువౌతుంది. రంగారావును తనకు దూరంగా వుంచుతుంది ఐహిక చింతనకంటె ఆమెలో ఆముష్మిక చింతన చోటుచేసుకుంటుంది.

పరీక్ష అధికారి హోదాలో రత్నావళి రాజమండ్రికిపోయి తిరిగి వస్తూ రైల్లో సీతారామయ్య మూడో భార్య అయిన రాజ్యలక్ష్మిని ఆమె కుమారుణ్ణి కలుసుకుంటుంది. ఆ పిల్లవాణ్ణి తన చేతుల్లోకి తీసుకుని రాజ్యలక్ష్మి అదృష్టానికి మనస్సులో నివాళులర్పిస్తుంది. ఆ పిల్లవాని చేతిలో పది రూపాయలు పెడ్తుంది. తానెవరో వారితో చెప్పదు. వాళ్ళు బెజవాడలో దిగిపోతారు.

కొన్నాళ్ళకు భర్తను చేరుకోవాలనే కోరిక రత్నావళిలో ప్రబలమౌతుంది. తను సంతానానికి అనర్హురాలు కాబట్టి రాజ్యలక్ష్మి కొడుకుచేత తన అనంతరం కర్మ చేయించుకునే వుద్దేశం ఆమెకు కల్గుతుంది. ఆమె ఉద్యోగం మాని వేస్తుంది. బ్యాంకులో ఆమె పేరిట రెండువేలకు పైగా ధనం వుంటుంది. ఒకరోజు స్థిర సంకల్పంతో భర్తవద్దకు బయల్దేరుతుంది. ప్రయాణం తుపానువల్ల కష్టమౌతుంది. నిద్రాహారాలులేక ఎంతో శ్రమపడి ప్రతిష్ఠానపురం చేరుకుంటుంది. రత్నావళి ప్రతిష్ఠాన పురానికే బయల్దేరి వుంటుందని ఆమె లేని యిల్లు తనకెందుకని రంగారావూ ఆపూరికే బయల్దేరుతాడు.

సముద్రం ఉప్పెన వస్తుందని భయపడి ప్రతిష్ఠానపురం ప్రజఅంతా మెరక ప్రాంతాలకు తరలిపోతూంటుంది. సీతారామయ్యగారి కుటుంబం అంతా ప్రయాణ సన్నాహంలో మునిగి వుంటుంది.

రత్నావళి నేరుగా వెళ్ళి భర్తపాదాలు పట్టుకుంటుంది. సీతారామయ్య ఆమె ఎవతో బిచ్చగత్తె అని అనుకుంటాడు. తనకున్న ఒక్క కోరిక చెల్లిస్తానని మాట ఇస్తే పాదాలు వదలుతానంటుంది. తన వద్దనున్న డబ్బును పిల్లవాని పేరుతో వేశాననీ, తన అనంతరం పిల్లవానిచేత తనకు ఆబ్దిక కర్మలు జరిపించాలని ఆమె కోర్కెగా వెల్లడిస్తుంది. డబ్బు అవసరం లేదనీ ఆబ్దిక కర్మలు పెట్టించడానికి తనకేమీ అభ్యంతరం లేదనీ సీతారామయ్య ఆమెకు హామీ యిస్తాడు. రత్నావళిని రాజ్యలక్ష్మి గుర్తిస్తుంది. పిల్లవాని చేతిలో డబ్బు పెట్టింది ఈమే అని భర్తతో రాజ్యలక్ష్మి చెబుతుంది. రత్నావళి పేరు తెలియనందున ఆమెకీ సన్నివేశం అయోమయంగా వుంటుంది. రత్నావళి చనిపోవాల్సిన అగత్యం ఏమిటని రాజ్యలక్ష్మి ప్రశ్నిస్తుంది అందుకు సమాధానంగా రత్నావళి 'నేనెందుకు చచ్చిపోవాలి అంటావు. చచ్చిపోక ఏమిచేయను? ఏ భర్తతో నీవు సుఖంగా ఉంటున్నావో ...ఏ భర్త ఒక అనాథురాలికి ఆబ్దికాలు పెట్టిస్తానని వాగ్దానమిచ్చేటంత మంచివాడో అటువంటి భర్తను వదలిపెట్టిపోయిన చెడ్డపె చావక ఏంచేస్తుంది? ఆ భర్తని వదలి పెట్టానని దుఃఖించి దుఃఖించి, ఈ పాపం ఎట్లాపోతుందా అని విచారించి విచారించి, తపస్సుచేసి చేసి, ఆభర్త మళ్ళీకలవడం అసంభం అని తెలిసి తెలిసి, కుమిలిపోతూన్న స్త్రీ ఇంకా ఏం చేస్తుంది? (16 అధ్యాయం. పు. 306) అని చెప్పి తాను ధర్మంతప్పి ప్రవర్తించాననీ, అందుకు తగిన ప్రతిఫలం అనుభవిస్తున్నాననీ తనకు మరణం ఒక్కటే మార్గం అనీ చెబుతుంది. బ్యాంకు కాగితాలను సీతారామయ్యకు ఇచ్చి రత్నావళి సముద్రాభిముఖంగా నడుస్తుంది. రాజ్యలక్ష్మితో సమానంగా రత్నావళిని స్వీకరిస్తానని

ఆమెను గుర్తించిన సీతారామయ్య అంటాడు. వెనుకకు తనను పిలువగలిగిన విశాలహృదయం భర్తకువున్నా, ఆ పిలుపును అందుకునే అర్హత తనకు లేదనీ భర్త ఔదార్యానికి తను నోచుకోలేదనీ నమస్కరించి వెళ్ళిపోతుంది రత్నావళి.

రంగారావు రత్నావళిని వెదుక్కుంటూ వచ్చి ఆమెను కలుసుకుంటాడు. ఆమెతో పాటు తనూ చనిపోవడానికి సిద్ధంగా వున్నానని చెబుతాడు. సముద్రుడు చెలియలి కట్టను దాటి వారిద్దర్నీ తనలో ఐక్యం చేసుకొంటాడు.

నవల ప్రారంభంలో రచయిత 'చెలియలి కట్టదాక సముద్రుడు చనడు' అని వ్రాస్తూ దానికి కారణం '...తదీయ హృదయమేదియో యొకండు ధర్మమావరించెను. తీవ్ర ధర్మమతనిని గట్టివేసెను'అంటాడు. నవలాంతంలో సముద్రుడు '.....హద్దులను ద్రెంచి పూర్వమర్యాద లురలి బద్దెలను దాటి ధర్మసంబంధ మెడలి... సముద్రము హోరుమని పెల్లగిలి వచ్చెను. ...కడలిలో నొక కెరటము తాటియెత్తున లేచెను. ఆ కెరటము లేచినంతనే చెలియలి కట్ట తాటిలోతున క్రుంగిపోయెను. ఆ కెరటము... తోక పైనిల్చి పెనుబాము దూకినట్లు ముందునకు వంగి పడగ గ్రమ్ముకొని చుట్టుకొన్నయట్టులు విఱిగి యొక్కుమ్మడి కడిపోయె' నంటాడు. ధర్మం తప్పినపుడు ప్రళయం సంభవిస్తుంది. రత్నావళి తనను తాను సముద్రానికి పోల్చుకుంటుంది. (రత్నావళికి సముద్రానికి సామ్యం) '...ఉప్పెన తప్పకుండావస్తుంది. సముద్రుడు చెలియలి కట్టను దాటి వస్తాడు. నన్ను తనలో ముంచివేసి కొంటాడు. నాలో నున్న ప్రకృతికి, సముద్రంలో నున్న ప్రకృతికీ భేదంలేదు. నేను చెలియలి కట్ట దాటాను. ఆయనా దాటుతాడు' అని భర్తపాదాలపై పడ్డప్పుడు అంటుంది. రత్నావళి దాటిన చెలియలికట్ట వివాహ సంబంధం అనే సరిహద్దు. భర్తను వదిలేసి రంగారావుతో లేచిపోవడం రత్నావళి దాటిన చెలియలికట్ట. ఆ కారణంగా తనలోని ప్రకృతి నశించిపోవాలని ఆమె కోరుకుంటుంది. ఆమె ఆవిధంగా మారిపోయి పతనం చెందడానికి మరది రంగారావు, ఆతని జగద్రహస్య సిద్ధాంతాలే కారణం. అతని జగద్రహస్య సిద్ధాంతం అయిన ప్రేమ స్వరూపం అతని కళ్ళను కప్పివేసిందంటారు రచయిత.

'ఈలోకమంతయు నన్యాయముగ నున్నది. స్త్రీలను బురుషులు పశుతుల్యులుగ జూచుచున్నారు...ఏబదియేండ్ల వృద్ధుడు పదునాలుగేండ్ల బాలికను బెండ్లియాడుచున్నాడు. ఆమె తన కిష్టము వచ్చిన పురుషుని వివాహము చేసికొనుటకు వీలులేదు.' ఈవిధంగా రంగారావు సిద్ధాంత ప్రభావానికి లోనయి తలుస్తుంటాడు. తన వదినెగారి యౌవనం వృద్ధుడైన తన అన్నగారికి భోగపదార్థంకాదు అనుకుంటాడు. తను యువకుడు. ఆమె యౌవనవతి. పాప పుణ్యాలు లేవు అనుకుంటాడు. దేవుడే లేడు. ఈ వైవాహిక సిద్ధాంతాలన్నీ స్వప్రయోజకుడయిన మనిషి నిర్మించాడని గాఢంగా నమ్మినవాడు రంగారావు అతని మనస్సులో కలవరం పుట్టింది. 'మనసులో కలవరమున్నదీ, కడలిలో కలవరము వున్నదీ, మనసు లోకపు హద్దులో విరుగున్, కడలి చెలియలికట్టలో విరుగున్, మనములో కలవరము హెచ్చిన, కడలిలో కలవరము పొంగిన, మనసు లోకపు కట్ట తెగిపోవున్, కడలి చెలియలికట్ట తెగి వచ్చున్, మనసు లోకపు కట్ట తెగితే, మనసు చచ్చిన ప్రేత కళలీనున్, కడలి భైరవు కాలి మువ్వలగున్.' (2 అధ్యా. పు 6). రంగారావు మనస్సులో హెచ్చిన కలవరం రత్నావళిని లేవదీసుకొని పోయేటట్లు చేసింది. రత్నావళితో లేచిపోవడంతో అతని మనసు లోకపు హద్దుదాటింది. అది వైవాహిక వ్యవస్థను అతిక్రమించింది. ప్రతిఫలంగా రత్నావళిలో అతని యెడ ప్రేమ భావానికి బదులు వైరాగ్యబుద్ధి పొడసూపింది. రత్నావళి అతని యందు విరాగిని యైనపుడు అతని మనస్సు చచ్చిన ప్రేత కళ లీనింది.

బాల్యవివాహాలను సమర్థిస్తూ 'ఆయుర్దాయములో నున్నదిగాని వయసులో నేమున్నది?...ఆశ్లేష పౌరుషేయములలో నున్నదిగాని వయసులో నేమున్నది' అని విశ్వనాథ సనాతన సంప్రదాయ భావాలను వెలిబుస్తారు. సీతారామయ్యకు వివాహాలు ఈ ప్రాతిపదికపైనే జరిగాయి. రంగారావు మతాని కిది గిట్టదు. రంగారావు ప్రేమ సిద్ధాంతంమోజులో పడ్డ రత్నావళికి వదినగారు హితబోధ చేసే సందర్భంలో, రచయితే బోధ చేస్తూన్నట్లు అన్పిస్తుంది. '...నీవు నీ మనస్సుకు నచ్చిన వానిని పెండ్లిచేసికొ దువు. వానికి బక్షవాతము వచ్చును మశూచికము వచ్చును. నీవే సౌందర్య మును చూచి వానిని గాంక్షించితివో యా సౌందర్యము యథాయథలగును ధనవంతుడని, యుద్యోగస్థుడని, వయసగలవాడని పెండ్లియాడినచో దైవమను కూలించదేని ఆధనము నశించిపోవును ఆ యుద్యోగములేకపోవును ఆ భ యకాల మరణము నొందవచ్చును సృష్టికి నీవు కట్టుబాటు చేయలేవు.. మన యదృష్టము కొలది నొక తల్లిద ద్రుల కడుపున బుట్టినట్లే యొకభ సమకూడును.' (4 అధ్యా. పు 58) సంప్రదాయసిద్ధమైన వైవాహికబంధ అతి పవిత్రమైందటాడు. 'సంప్రదాయ పూర్వులైనవారు కొంద ఱేర్పచినది. సంస్కారము క్రొత్తవారు కొందఱు చేసినది. సంస్కారములో సంప్రదా ములో సంప్రదాయములో నున్న భద్ర లేదు' (10 అధ్యా. పు 186). విశ్వనా వారు నవల్లో చెప్పదల్చుకున్నసిద్ధాంతం వైవాహిక వ్యవస్థలోనే ప్రేమ వుంటుదనీ, ఆ వ్యవస్థను వీడి ప్రేమ జీవిం

వుండలేదని - నవల్లో నిరూపిస్తారు. వైవాహికసంబంధం వీడిన ప్రేమప్రవృత్తి కేవలం శారీరక కామప్రవృత్తి. అది వాంఛాప్రబలితమై వుంటుంది. దానికొక గమ్యం వుండదు. దానిలో భద్రత లేదు అంటారు రచయిత.

ప్రేమ దివ్యస్వరూపము, అది కారణం లేకుండానే స్త్రీ పురుషులలో పుట్టుతుంది. అని నమ్మిన రంగారావు సిద్ధాంతాన్ని రత్నావళి ఖండిస్తుంది. వైవాహిక సంబంధం కారణంగానే దంపతులలో ప్రేమ జనిస్తుందని, వైవాహికబంధం ఒకానొక ఇహపరసాధనంగా పరిణమిస్తుందని, ప్రేమ అనునది వివాహజీవితంలో అనుశ్రుతంగా కలిసిపోయేదనీ విశ్వనాథ వారు విశ్వసిస్తారు. 'స్త్రీ పురుషవాంఛయు సర్వత్ర యొక్కటియే, కాని దాంపత్యమునందు విశేషము. తల్లిదండ్రులు కూర్చినరని, ఒక కులమువారని, ఒకగోత్రమువారని, ఒకపాయవారని, అది సంఘమర్యాదయని, అది మన పూర్వులు పుణ్యలోకహేతువుగా చెప్పిరని, ఈ కారణములచేత దంపతుల మధ్య వాంఛ యెడబాయరానిది ... వాంఛ మనస్సులో కలుగును. మనస్సు క్రొత్తదానికి రసించును. ప్రాతదానికి రసింపదు. పరిచితమైన వస్తువునందు మనస్సు పరిచితముకాని వస్తువునందువలె వ్యగ్రత నొందదు. పరిచితమైన వస్తువునందు వ్యగ్రత పొందుటకు మనస్సునకు నిత్యదోహదము కావలయును. ఆ దోహదమే భార్యాభర్తలకు సమ సుఖదుఃఖమైన జీవితము గలిగియుండుట. తామిరువురు భార్యాభర్తలమని తమకు గలిగిన సంతతి వలన తమకు బుణ్యలోకములు ప్రాప్తించునని మొదలయిన విషయములు నిశ్చలమైన భావన? (7 అధ్యా. పు 122-123).

ప్రేమ కారణాలను ఆశ్రయించి వుంటుందన్న రత్నావళి వాదాన్ని రంగారావు ఒప్పుకుంటాడు. ప్రేమ దివ్యమయిన వస్తువు, అది మానుషప్రకృతికి అతీతమై, యెందుకో యెక్కడో యెప్పుడో ప్రకాశిస్తుంది, అని పూర్వం తానన్న మాటలు భ్రాంతి మంతములంటాడు (పు 179). శరీర సంబంధం కామం. అటువంటి కామానికి పెద్దపెద్ద పేర్లు పెట్టి బ్రహ్మత్వలక్షణాలను ఆపాదించడం వినాశకరం అంటారు రచయిత. 'ఈ మనుష్యజాతి తన మనోభావములకు పెద్ద పెద్ద పేర్లు పెట్టి, భావములను దివ్యములుగా భాసింపజేసి యనర్థచయంబులందు దుశ్శీలత నర్థకల్పనము చేసెడిది (10 అధ్యా. పు 185).

ధర్మ బద్ధమయిన దాంపత్య వాంఛ ప్రేమ స్వరూపంగా పరిణమిస్తుందంటాడు. స్త్రీ పురుషులు కామోద్రేకానికి పాల్పడినంత మాత్రంచేత అది ప్రేమ అనిపించుకోదు. రత్నావళి రంగని యందు పొందింది ఈ కామోద్రేకమే. ఈ కామోద్రేకానికి 'ప్రేమ యను క్రొత్త పేరు పెట్టిరి... ఆ ప్రేమ శరీర సుఖముతో గూడినది' (10 అధ్యా. పు 18). సాంప్రదాయిక వైవాహిక సంబంధంలో అది ధర్మబద్ధమయిన ప్రేమ స్వరూపంగా పరిణమిస్తుంది. 'ధర్మం-చదువుకొంటే తెలుస్తుంది. అది తెలియక పోయినా సంప్రదాయంలో ఉండే ధర్మమే యాచరింపబడుతూ వుంటుంది. తర్వాత ధర్మం తెలిసి తాను చేసిన పాపం గ్రహించిన వ్యక్తి జీవితం అందులో స్త్రీ జీవితం మరీ దుర్భరం. రత్నావళి జీవితం అలాంటిది. యౌవనం క్షణికంగా వుంటుంది. శరీరం అంతకన్నా క్షణికం. ఆ శరీరం ధర్మాన్ని అవలంబిస్తూన్నంత సేపూ నిలిచి వుండటం ఉత్తమం. 'శరీర మాద్యం ఖలు ధర్మ సాధనమ్' శరీరం వుంటేనే ధర్మం అవలంబించడానికి వీలు. కనుక ఆ శరీరాన్ని రక్షించుకోవాలి. బుద్ధిపూర్వకంగా ఒక స్త్రీ తన శరీరం ధర్మాచరణకు అనర్హం అయ్యేలా చేసుకుంటే ఆ శరీరం వుండి ప్రయోజనం లేదు. ఆ స్త్రీ ఆ శరీరాన్ని వెంటనే త్యజించాలి. రత్నావళి తెలిసీ తెలియక శారీరకంగా పతనం చెందింది. ధర్మాచరణకు ఆమె శరీరం అనర్హమైంది. సంతానం స్త్రీ ప్రకృతి ధర్మం. 'వివాహము చేసికొనినవారికి సంతానము కలుగును. ఆ సంతానము తల్లిదండ్రులకు తర్పణమును వదలుదురు...ధర్మము కాని సంతాన మెందులకు' అని తలచి ధర్మాచరణకు అనర్హమయిన శరీరాన్ని రత్నావళి పరిత్యజిస్తుంది. సముద్రుడు చెలియకట్టపైకి పాకి ఆమెను తనలో ఇముడ్చుకుంటాడు.

వివాహం విషయంలో స్త్రీ పురుష వయోభేదాన్ని సమర్థిస్తాడు. '... గీత బాగుండవలయును గాని, కొంచెమేండ్ల తారతమ్యములో నేమున్నది? ... మగవాండ్రకఱువదియేండ్లు వరకు వయసుండును. స్త్రీలకు నలుబది ఏండ్లతో వయసుడిగిపోవును... ముప్పదియేండ్ల పురుషుడు మూడేండ్లయాడుది-యని మనదేశములో వాడుక. ఈ మరబియ్యముతో, కాఫీహోటళ్ళతో నీకాలములో నాయుర్దాయము తగ్గిపోయినది. కాని అఱువదియేండ్లవఱకును పురుషుల ఆరోగ్యము చెడదు (15 అధ్యా. పె 280)

ప్రేమ స్వరూపాన్ని గూర్చి వేయిపడగలు నవల్లో రచయిత వెలిబుచ్చిన అభిప్రాయం ఇక్కడ పొందుపరచదగింది. '...ప్రేమయనగా భార్యాభర్తలు కలసి కొన్నాళ్లు సంసారము చేసిన తరువాతగాని కలుగదు. ఆ ప్రేమకు వయస్సౌందర్య ధనాదికములతో పనిలేదు, అది పరిచయాధిక్యము వలన, మనస్సు నలవాటుల వలనను వచ్చును... ప్రేమయనునది మనోవిషయము...' (వేయిపడగలు. 36 అధ్యా పు 1013) చెలియలికట్ట నవల్లో ఇదే విషయం ప్రధానంగా చెప్పబడింది. శారీరకమైనది ప్రేమ కాదు.

(తరువాయి 8 వ పేజీలో)

# ఆధునికాంధ్ర కవిత్వంలో జాతీయభావన

రచన : ఇ. టి. లోకనాథరావు, ఎం. ఏ.

జాతి పురస్సరమైంది జాతీయభావన. ఒక జాతిని, తత్సంబంధమైన వాళ్ళందరూ కీర్తించుట సహజం, సమ్మతం. ఈ కారణంచేతనే "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అనే ప్రాచీనసూక్తి లోకంలో వెలసింది.

ఆధునికులు భావించే రీతిలో, ప్రాచీనులు జాతీయ భావాన్ని గుర్తించలేదు. భారతదేశంలో విస్తృత ప్రాంతాల్ని కొద్దిమంది మహారాజులు పరిపాలించినను, అది కేవలము రాజకీయమైన సార్వభౌమత్వాన్ని స్థాపించుటకే కాని, జాతీయ భావాన్ని ప్రేరేపించుటకు కాదు. ప్రాచీన భారతదేశం చిన్న చిన్న వ్యష్టిదేశాలుగ పరిపాలింపబడినది కాని, సంపూర్ణ ఏక జాతిగ పరిపాలింపబడలే దని చరిత్రకారులు చెప్పారు. చిన్న చిన్న పరిపాలన పద్ధతులవల్ల, భిన్న భిన్న మతసంప్రదాయా లేర్పడి, బాగా ప్రచారం గల గ్రంథాలు ప్రామాణికా లయ్యాయి. ఒక చోట 'మను ధర్మశాస్త్రం' మరొక చోట 'యాజ్ఞవల్క్యం' ఇంకొక చోట ఇంకొకటి ప్రసిద్ధిగాంచినవి. కాని ప్రాచీన భారతదేశంలో వైదికమతం అనుస్యూతంగా ఉండుటచే భిన్నత్వంలో ఏకత్వం సాధించుటకు అవకాశం కల్గింది అందుచే ప్రాచీన భారతదేశంలో 'జాతీయభావన' పరిపూర్ణత్వం పొందక ఒక కోణంనుండే ప్రసారితమైం దని పలువురు చరిత్రకారుల అభిప్రాయం.

ప్రాచీనాంధ్ర కవిత్వంలో జాతీయ భావన కల దని కొందరు చెప్పుట కద్దు. కాని ప్రాచీనుల భావం ఆధునికులకన్నా భిన్నమైంది. నన్నయ 'చింతామణి' లో 'స్వస్థాన వేషభాషాభి మతా స్సన్తో రస ప్రలుబ్ధ ధియః, లోకే బహు మన్యన్తే వైకృత కావ్యాని చాన్య దపహాయ" అని చెప్పుట భాషాపరమైన అభిమానమే తప్ప, జాతియొక్క అభ్యుదయోన్నతి కాదని ఆధునికులు, అభ్యుదయులు భావించారు. 'విశ్వశ్రేయః కావ్యమ్' అనుటలో ప్రాచీనులు చెప్పిన 'వసుధైక కుటుంబకమ్' అనేసూక్తిమూలము కావ్యపరమైన సమన్వయ భావనే తప్ప. జాతీయతా పరిమళపు గుబాళింపు మాత్రము కాదని చెప్పవచ్చు. తిక్కన భారతమునందు 'ఆంధ్రావళి మోదముం బొరయ' అని చెప్పుట కూడ కావ్యపరమైన జాతినిర్దేశమే తప్ప, సమ్యగ్జాతీయ భావం కాదని ఆధునికుల అభిప్రాయం.

ఇంగ్లీషువారి పాలనకు, భారతదేశంలో జాతీయ దృక్పథం ఏర్పడుటకు, దగ్గర సంబంధం కలదు. లార్డ్ క్లైవు 'ఆర్కాటు ముట్టడి' దిగ్విజయంగా నిర్వహించిన పిదప, భారతీయ పరిపాలనలో చోటు చేసుకొనుటకు అవకాశం కల్గింది. పరిపాలన కేంద్రీకరణ దృష్టితో వైస్‌రాయ్ నియామకం జరుగుటవల్ల, భారతదేశం ప్రత్యేక వ్యష్టిపరిపాలనక్రిందకు వచ్చింది. దీనికితోడు ఆంగ్లపఠనం భారతీయుల దృక్పథమునందు తీవ్ర భావ సాంద్రత తెచ్చింది. 'అమెరికా స్వాతంత్ర్య పోరాటం' ఫ్రెంచి విప్లవం, 'రష్యా విప్లవం' ప్రభావాలు ఆంగ్లపఠనం ద్వారా భారతీయుల మేధల్లో జాగృతి కలిగించాయి. గాంధీగారు సైతం ఆంగ్లపఠనం 'భారత జాతి కొక వరం' అని ఉద్బోధించారు. పాశ్చాత్య దేశాల్లో విద్య నభ్యసించి, స్వదేశానికి తిరిగివచ్చినవారు భారతీయ సంఘాన్ని నవీన దృక్కులతో చూడసాగారు. ఆంగ్ల పఠనం ద్వారా ప్రభావితులైన శ్రీ గురజాడవారు,

"కన్ను కానని వస్తుతత్త్వము
కాంచ నేర్పరు లింగిరీజులు
కల్ల నొల్లరు, వారి విద్యల
కరచి సత్యము నరసితిన్"

అని ఆంగ్లేయుల భాషా ప్రాభవాన్ని తెల్పారు. 'నేషన్' అనెడి భావం భారతీయుల్లో కల్గుటకు ఆంగ్లేయుల ప్రభావం మూలమని ఎక్కువమంది చరిత్రకారులు, విమర్శకులు అంగీకరించారు.

కలకత్తా రాజధాని కావడంవల్ల, భారతదేశంలో ఏ పాశ్చాత్య ప్రభావం కల్గినా, అది వంగదేశమునందు మొట్టమొదట కల్గుట పరిపాటి. 1905 లో కర్జన్ వంగదేశాన్ని రెండుగా చీల్చివేయడంతో, భారతీయుల్లో నిద్రాణమై ఉన్న జాతీయభావన తలెత్తింది. శ్రీ బిపిన్ చంద్రపాల్ ఆంగ్లేయుల దౌర్జన్యకాండకు గురై ప్రతిరాష్ట్రం తిరిగి ఉపన్యాసాలిచ్చిరి. ఈ ఉపన్యాసాలు "భారతీయులందరూ ఒకేజాతి" అనే భావాన్ని కల్గించాయి. వంగ, బీహార్, రాష్ట్రాల్లో చెలరేగిన భాషాపరమైన కల్లోలాలు, సంఘసంస్కరణాభిలాషలు, గ్రంథాలయ ఉద్యమాలు జాతీయభావం పెంపొందించుటలో తమ తమ పాత్రలు నిర్వహించాయి దీనికితోడు పత్రికలు కూడ చేయూతనీయసాగాయి. 1010 లో గుంటూరులో 'యువజన సాహిత్య సంఘ సమావేశం' 1913 లో బాపట్లలో జరిగిన 'ప్రథమాంధ్ర మహాసభ' భారతీయుల్లో జాతీయభావన ప్రబలుటకు దోహదకారులయ్యాయి.

సాహిత్యంలో కూడ జాతీయభావన తలయెత్తుటకు ఆంగ్లేయుల దౌష్ట్యాలే కారణా లయ్యాయి. విదేశపాలనను నిరసించుట, ఆంగ్లేయ సామ్రాజ్యవాద. ఘోర

ణిని సహించకపోవుట, వారి దోపిడీ విధానాన్ని ఎత్తిచూపుట కవిత్వమందు చోటుచేసుకున్నవి. బిపిన్ చంద్రపాల్ ఉపన్యాసాలచే ప్రభావితులై శ్రీ చిలకమర్తివారు ఆంగ్లేయుల్ని నిరసిస్తూ

"భరతఖండంబు - చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియగట్టి"

అని ఆంగ్లేయుల పక్షపాత వైఖరి వెల్లడిచేసి ప్రథమ జాతీయ కవిగా గుర్తింపబడ్డారు. ఆంగ్లేయుల్ని కేవలం తిట్టడమే కాక, వారు చేయు దుండగాలను ఎత్తి చూపించి, తత్ఫలితాన్ని హేతుసహితంగా నిరూపించినవారు కలరు. ప్రజాస్వాతంత్ర్యాన్ని అరికట్టే విధానం, శారీరక మానసిక బాధను కల్గించే పద్ధతి వెల్లడిచేసిరి. సామాన్య ప్రజానీకానికి ఆంగ్లపాలనపట్ల కల్గిన ఏహ్యభావాన్ని కన్నులకు కట్టినట్లు రచించినవారు శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణరావుగారు.

"మాకొద్దీ తెల్లదొరతనం
నూటనలుబదినాల్గు నోటికి తగిలించి
పాట పాడవద్దంటాడు, టోపీ
తీసి వీపున బాదుతాడు"

ప్రాచీన చారిత్రక వీరుల్ని గ్రహించి, వారిద్వారా జాతీయ భావాన్ని ప్రదర్శించుట నవ్యాంధ్రకవులు చేపట్టిరి. చరిత్రలో గత వీరుల జాత్యభ్యుదయ పోరాటాల్ని ప్రతీకలుగ గ్రహించి, ఆంగ్లప్రభుత్వ నిరసనకు ముడిపెట్టిరి. గత వీరుల్లో కట్టలు తెంచుకొని ప్రవహించిన ఆవేశాన్ని నవ్యాంధ్ర కవులు ఆవేశింపజేసుకొని, ప్రస్తుత పరిస్థితులకు అన్వయించి జాతీయ భావాన్ని ప్రదర్శించారు. తుమ్మలవారు 'తేజ్ బహద్దూర్' అనే శిక్కు వీరుణ్ణి గ్రహించి, ఔరంగజేబు సామ్రాజ్యవాదాన్ని ఎదిరించి జాతికొరకు అసువులు బాసిన వృత్తాంతాన్ని 'ఆదర్శవీరుడు' అనే కావ్యంలో వెల్లడిచేసారు. ఆధునిక మహాకావ్యాలుగ ప్రశంసించబడిన వానిలో రెండు ముఖ్యమైనవి ఒకటి 'రాణా ప్రతాపసింహ చరిత్ర' దీనిలో రాణా ప్రతాపసింహుడు స్వాతంత్ర్యం కొరకు జీవితపర్యంతం అక్బరుతో పోరాడుట వర్ణింపబడినది. రెండవది 'శివభారతం' దీనిలో హైందవ మతోద్ధరణకు శివాజీ ఔరంగజేబును ఎదిరించిన ఇతివృత్తం వర్ణింపబడింది

ఆదర్శవీరుల్ని కీర్తించు పద్ధతి ముదిరి వ్యక్తిపూజకు దారితీసింది. గాంధీగారు కొందరి దృష్టిలో భగవంతులైనారు. శ్రీ బసవరాజు గారు,

"చకచక నడిస్తే జగతి కంపించేను
పలుకు పలికితే బ్రహ్మవాక్కేను"

అని ప్రజాశక్తికి ప్రతీకయైన గాంధీగారి శక్తిని నిరూపించారు. కొంతమంది కవులు ఒక మెట్టు ముందుకుపోయి గాంధీగారిపై 'హారతి పాటలు' 'సహస్రనామావళులు' కూడ రచించారు. ఇటువంటి రచనలు జాతీయభావనకన్న వ్యక్తిపూజను ప్రదర్శించాయి. ఈ ఆదర్శవ్యక్తిపూజ రెండు తెగలుగ సాగింది. 1. అహింసాయుతం 2. విప్లవపూరితం. గాంధేయవాదులు అహింసాత్మకమైన జాతీయ భావాన్ని వ్యక్త్యాదర్శప్రాయంగా వెల్లడిచేయగా, విప్లవవాదులు హింసాత్మకమైన చర్యల ద్వారా జాతీయభావాన్ని ప్రదర్శించారు. ఈ శాఖకు చెందినవాడే శ్రీ సుభాస్ చంద్రబోసు. ఆయన 'అజాద్-హింద్-ఫౌజు' అనే సైన్యాన్ని తయారుచేసి, ప్రముఖ విప్లవకవి నజరుల్ ఇస్లాం గీతాన్ని ఆలాపిస్తూ, జాతీయభావాన్ని పెంపొందించడానికి ప్రయత్నించారు. ఆంధ్రుల్లో కొంతమంది విప్లవదృక్పథంలో శ్రీ అల్లూరి సీతారామరాజును ఆదర్శంగా గ్రహించి జాతీయభావాన్ని పొందసాగిరి. ఈ శాఖీయులకి పోరాటమే ముఖ్యసాధనం. వీరిలో కష్టజీవులు అధికసంఖ్యలోనుండిరి. వీరు గాంధేయులది 'గాజుల గలగల' అని వేళాకోళం చేసేవారు. ఇందుకు నిదర్శనంగా వారు అల్లూరి సీతారామరాజుకు విన్నవించుకొన్న గీతం మచ్చుతునక.

'గాంధీ తత్వమెల్ల గాజులు గలవారి
మోజునందుచునుండె రాజ
అల్లూరి శ్రీరామరాజ - వారికి
గాంధీయే దైవంబురాజ - వారు
తన్నారు కొట్టూరు రాజ - ఈరీతి
దాస్యంబు తొలగు టెన్నడో రాజ
అల్లూరి శ్రీరామరాజ !'

ఈ ఆదర్శవ్యక్తిపూజ వాస్తవికకవితాభావాన్ని, తన్మూలంగా కొంత జాతీయభావాన్ని కల్గించిందే కాని, మొత్తం జాతిదృష్ట్యా సంపూర్ణ జాతీయభావాన్ని కల్గించక 'ఆదర్శవాదం' వైపే ఎక్కువ మొగ్గుచూపిందని ప్రగతి వాదులు భావించారు.

నవ్యాంధ్ర కవులు పౌరాణిక ఇతివృత్తాన్ని సైతం గ్రహించి జాతీయ భావాన్ని ధ్వనింపచేసారు ఐతిహాసిక ఆదర్శ పాత్రల్ని గ్రహించి, తద్వారా ప్రస్తుత పరిస్థితి కన్నులకు కట్టినట్లు చూపించారు. ఆవేశమైందీ, ఆదర్శమైందీ చాలా వరకు నవ్యాంధ్రకవుల కలాల్లో జాతీయభావనను సంతరించుకొంది. చామర్తి రాజశేఖరరావుగారు తమ 'పాంచాలీ సాంత్వనం' లో ఆంగ్లేయుల్ని ధార్తరాష్ట్రులంగాను, ద్రౌపదిని భరతమాతగాను, జాతీయభావాన్ని శ్రీకృష్ణుడిగాను ధ్వనింపచేసారు. ఉదయశ్రీ గారు తమ 'ధనుర్భంగం' కావ్యం ఖండికలో జాతీయభావాన్ని వెదజల్లారు.

'చెల్లరే విల్లువిరుచునే నల్లవాడు
పదిపదారేండ్లగల రాచపడుచువాడు
సిగ్గు సిగ్గంచు లేచి గర్జించినారు
కనులు గుట్టిన తెల్ల మొగాలవారు'

జాతీయభావంతో మానవతావాదం కూడ చోటుచేసుకుంది. తోటి మనిషిని ప్రేమించడం కన్నా గొప్ప విషయం లేదనే భావం ప్రబలింది. 'త్వమేవాహం' వంటి సూత్రాలున్నా, అవి మతం పరమై

పోయాయి కనుక, పాశ్చాత్య ప్రభావం వల్ల వచ్చిందైనను ఈభావం గొప్పది కనుక పలువురు గ్రహించారు. గురజాడ వారు విశ్వమానవ ప్రేమ ప్రకటించి నవయుగ వైతాళికులైనారు. మానవతా వాదం వల్ల కులమత, వర్ణభేదాలు నశించి 'మానవులందరూ ఒక్కటే' అనే భావం ప్రబలి 'మనమందరం భారతీయులం' అనే సృష్టి కల్గుటచే జాతీయభావన మరింత పుష్టి చెందింది. ఈ భావాన్నే గురజాడ వారు ప్రదర్శించారు.

'ఎల్లలోకము లొక్క ఇల్లై
వర్ణ భేదములెల్ల కల్లై
వేలనెరుగని ప్రేమ బంధము
వేడుకలు కురియు'

ఈ భావన 'వసుధైక కుటుంబకమ్' అనే ప్రాచీన సూక్తికి నిదర్శనమైనను, మంచిదృష్టి కలది.

జాతీయభావంతో కర్తవ్య బోధ ముఖ్యంగా ప్రోక్కనతగింది. దాస్య శృంఖలాల్లో పడున్న పీడిత జాతిని మేల్కొల్పుట జరిగింది. నిర్వీర్యులుగ, నిస్తేజులుగ నిర్భాగ్యులుగ జడత్వ మొందిన భారత జాతిని కర్తవ్యోన్ముఖులుగ చేయుట ప్రథమ కర్తవ్యంగా నవ్యాంధ్ర కవులు భావించి ప్రేరణచేయసాగిరి.

'అవమానమేలరా
అనుమానమేలరా
భారతీయుడ నంచు
భక్తితో పాడ'

అని రాయప్రోలు వారు వెన్నుతట్టిరి.

జాతీయభావనయందు ప్రతీకాత్మకత కూడ చోటుచేసుకుంది. జాతీయ జెండాను, రాట్నాన్ని, చివరకు మట్టిని ప్రతీకలుగ గ్రహించారు. శాంతి సౌభాగ్యాలకు, సహజీవనానికి భారతభూమి ఆదర్శమని మురిసి పోయారు. భారతీయ ధూళిసైతం పావనమైందని, సృజనాత్మక మైందని భాషించారు.

'సూర్యుని వెలుతురుల్ సోకనందాక
ఓడల జెండాలు ఆడునందాక
అందాక గల ఈయనంత భూతలిని
మన భూమి వంటి చల్లని తల్లి లేదు'

అని రాయప్రోలు వారు భారతభూమి ఔన్నత్యాన్ని చాటిరి.

జాతీయభావన వల్ల మునుపెన్నడూ లేనంత సమభావం, సహజీవనం ఏర్పడింది వ్యక్తి దృక్పథం ఎల్లలు లేనిదైంది. భారతీయులందరూ ఒక్కటే అనే భావన ప్రబలి,జాతిపటిష్టత, సమైక్యము, సమ్యక్పరిశీలన ఏర్పడ్డాయి. భిన్న మతాలు, భిన్నభాషలు, భిన్నజాతులు కలిగున్నను 'మనమందరం భారతీయులం' అనే సర్వమానవ సౌభ్రాతృం కల్గి, భిన్నత్వంలో ఏకత్వం సాధింప బడ్డది. నిరాశావాదం అడుగంటి అభ్యుదయ భావవీచికలు ప్రతిగుండెలో ఉవ్వెత్తున లేవసాగాయి.

సాహిత్య రంగం కూడ ఒక క్రొత్త మలుపు తిరిగింది. అలౌకిక, సాంప్రదాయిక ధోరణి పోయి, వాస్తవిక విప్లవ ధోరణి రెక్కవిప్పినది. సామాన్య ప్రజలే కావ్యాలంబములైరి. కన్నులముందుజరుగు చున్నది, అనుభవాత్మకమైనది, కావ్య వస్తువుగ పరిగణించుట ప్రబలినది. స్వజాతిని, స్వదేశాన్ని కీర్తించుట ఉత్తమ కావ్య లక్షణంగా పరిగింపబడెను. శ్రీరంగం నారాయణబాబు గారి 'దేశమాత' 'కపాలమోక్షం' భావచిత్ర వాద పద్ధతిలో రచింపబడిన జాతీయగీతాలు ప్రగతిగుండెను కలచివేసాయి. జాతీయ భావన వలన కవిత్వమందు సామాన్య మానవునికి కావ్యత్వ మాపాదింపబడెను. ఎదుటివాని బాధను, బరువును చూచి కవిహృదయంలో కవితాస్రవంతి పెల్లుబుకుటకు చక్కని దోహదకారియైనది. వాస్తవికమైన ఆచరణాత్మకమైన ప్రగతిశీలమైన కవితాఝరిని ప్రవించింది. జాతీయభావన దేశదృష్టితో, కవిత్వ దృష్టితో ఒక గొప్ప మలుపని భావింప వచ్చును.

జాతీయభావన వల్ల కొన్ని భావతీవ్రతలు కూడ చెలరేగాయి. ప్రాంతీయాభిమానం పెరిగి, తత్సంబధమైన దంతయు గొప్ప దనుట, మిగిలిన దంతా చెడ్డదనుట వరకూ పోయింది. ఈ పక్షపాత దృష్టి వల్ల జాతీయభావన దెబ్బతనే పరిస్థితి కూడ కలిగింది. డా॥ సి. నారాయణరెడ్డి గారు దీన్ని 'అభిమానాతి రేకం' అని సౌమ్యంగా చెప్పారు.

చారిత్రక విషయాన్ని గ్రహించు నపుడు లోతుపాతుల్ని గ్రహింపక బాహ్య సౌందర్యాన్నే గ్రహించుట

జరిగింది. శివాజీ హిందూధర్మరక్షకుడుగ చిత్రింపబడెను. కాని శ్రీముల్లంపల్లివారు శివాజీ తన ముట్టడుల్లో హిందూ గ్రామాల్ని, ఆస్తుల్ని దోచుకొన్నాడని వ్రాసారు. రాణాప్రతాపునికి, అక్బరుకు మధ్యగల వ్యక్తిగత సామ్రాజ్యవాద పూరిత వైషమ్యాలను జాతీయభావనతో ముడిపెట్టుట కొంతమంది ప్రఖ్యాత చరిత్రకారుల దృక్పథమునకు సరిపడని భావన

అకారణమైన, దురభిమాన పూరితమైన స్వదేశకీర్తన 'చావనిజల' దేశ శ్రేయస్సుకు భంగకరమని సముసమాజ సిద్ధాంతవాదులు చెప్పారు. 'నాయకులు వస్తారు. నాయకులు పోతారు మిగిలేవారు ప్రజలే, వారే నిజమైనశక్తి'. అని స్టాలిన్ చెప్పారు. కనుక ప్రజాభ్యుదయం దృష్ట్యా కేవలం స్వజాతీయాభిమానం, జాతీయ భావన క్రింద చలామణి అగుట కుదరదు. కమ్యూనిస్టుల అంతర్జాతీయ దృక్పథం కూడ చాలావరకు ప్రాంతీయభావాన్ని తగ్గించిందని చెప్పొచ్చు. భారత స్వాతంత్ర్యం సిద్ధించిన పిదప జాతీయభావనా దృక్పథంయొక్క ఆవశ్యకత తగ్గినటుల కనిపిస్తూఉంది. కాని జాతీయ భావనా మూలంగా దేశానికి సాహిత్యానికి కీడు కన్నా, మేలే జరిగినదని చెప్పక తప్పదు.



( 4 వ పేజీ తరవాయి )

అది కేవలం వాంఛా శారీరిక సంబంధి ప్రేమ మనస్సంబంధి అని నొక్కి చెబుతున్నాడు. తనంతట తాను ఏక్షణంలో తలచుకొంటే ఆక్షణంలో ప్రేమ జనించదు. వాంఛకు ముగింపు అసంతృప్తిఅవుతుంది. ప్రేమకు మరోరూపం సంతృప్తి. వాంఛకన్నా అతీత మయిందీ ప్రేమ తత్వం. ఇటువంటి ప్రేమ తత్త్వం మనస్సునకధీనమై వుంటుంది. ప్రేమ తత్త్వం మనోనియమానికి లోబడి వుంటుంది. మనస్సును కట్టుబాటులో వుంచుకొనాలి. 'మనసు గుఱ్ఱము రోరి మనిసీ, మనసు కళ్లెమును వదలితే కంచెలోబడ ద్రోయు'ను అని నవల ప్రారంభంలో రచయిత సన్యాసి చేత పాడింపచేస్తాడు. మనస్సును కట్టుబాటులో వుంచుకొనాలి అనే రచయిత ఉద్దేశాన్ని చెలియకట్ట నవలనిరూపిస్తుంది. మనస్సును నియమించాలి అంటే నిగ్రహం, సాధన ముఖ్యం. మనో నిగ్రహంతో ప్రేమను సాధించుకొనాలి.

ఇదే జీవితసత్యంగా మనకు ఈనవల్లో కనపడుతుంది. సంప్రదాయం మనో నియమాన్ని అనుసరిస్తుంది. సంప్రదాయం లోనే సాధన వుంది. బహిరుపాధుల కన్న అనుభూతి సాంద్రత్వమున విశిష్టత యున్నది. అనుభూతి లోకములో వేఱు. వానికి భాషపట్టదు. ఉపాధులు పట్టవు. కాని అనుభూతి లేనప్పుడు ఉన్నట్లుగా భాసించును (అది వాంఛ రూపంలో వ్యక్తమౌతుంటుంది). ఆ భ్రాంతి చెడ్డది. మనస్సుచేత తెలిసికొని మనస్సుచేత అనుభవింపలేని యొక స్థితి యందుండును. నాడు కర్మాచరణమునకు గాక మహానుభూతికి గాక చెడిపోవును'(15 అధ్యా. పు276) కావ్యాలు నవల్లో చాలాముఖ్యమయినవి. అనుభవం మానసికావస్థను దాటి క్రియావస్థోన్ముఖంగా నడచినపుడే ప్రేమానుభూతి సాధ్యమౌతుంది. మానసికావస్థను దాటిపోలేని సిద్ధాంతాలు లోకంలో ఎక్కువకాలం మనలేవు.

క్రియావస్థోన్ముఖంగా నడచిన సిద్ధాంతాలే కర్మాచరణానికి, మహానుభూతికి దోహదం చేస్తాయి. సంప్రదాయ సిద్ధమయిన వైవాహికసంబంధం క్రియావస్థోన్ముఖమయింది. వివాహసంబంధమే ఐహిక ఆముష్మికముల ప్రేమానుభవ సాధనం. వైవాహిక వ్యవస్థను వీడి ప్రేమ బతకదు. తాత్కాలిక ప్రలోభాలకు లోనైన సిద్ధాంతాలు భ్రాంతిమంతాలై 'చచ్చిన ప్రేతకళ లీనుతాయి.'

ప్రేమ అంటే తెలియని, ఇంకా అనుభవంలోకిరాని, రత్నావళిని తాత్కాలిక ప్రలోభానికి ఎరచేసి సిద్ధాంతాల పేరిట రంగారావు మోసం చేశాడు. చివరకు చచ్చిన ప్రేతకళ అయినాడు. మనసులో పుట్టిన కలవరాన్ని అణుచుకోలేక పోయాడు. రత్నావళి భర్తను వదలిపెట్టి పోయిన పాపానికి కుపితయై, పశ్చాత్తాపము పొంది జ్ఞానమార్గ మవలంబించి క్రియావస్థోన్ముఖియై ప్రేమతత్త్వాన్ని అవగాహనం చేసుకొని తిరిగివచ్చి భర్తపాదాలపై బడుతుంది. ధర్మాచరణకు అర్హం కాని శరీరాన్ని సముద్రునిలో కలుపుకుంటుంది.

ప్రేమతత్త్వం వైవాహిక బంధానుయాయి. వైవాహికవ్యవస్థలోనే ప్రేమకు మనుగడఉంది అనే ఉద్దేశంతో విశ్వనాథ సత్యనారాయణ చెలియలికట్ట నవలను రచించారు. నవలా రచనలో సజీవ పాత్ర చిత్రణం చేశారు. వారి ఆశయం సిద్ధించిం దనే చెప్పాలి.

—...—

## రఘునాథ రాయల

# వాల్మీకి చరిత్రము

— కలవరపు వేంకట్రామయ్యా, ఎం. ఏ.

విజయ నగర భువనవిజయ సభాప్రాంగణాన మధుర మంజుల శింజినీ ధ్వనుల నృత్య మొనరించిన ఆంధ్రభాషా యోష కాలవశమున అధోముఖియై పరరాజుల పంచను జేరినది. తంజావూరు, మధుర, మైసూరు, పుదుక్కోట పాలకులు ఆంధ్ర సరస్వతికి అందలములు పట్టిరి. దివ్యనీరాజనము లర్పించిరి. అందునా తంజావూరి పాలకులది అగ్రతాంబూలము. వారిలో రఘునాథరాయలు శిరోరత్నము ఆ సారస్వత పారదృశ్వుని 'విజయ భవన' సభాసదనమున ఆంధ్రసరస్వతి నూతన చైతన్య చకచ్చకిత యైనది.

సాహితీ సమరాంగణ సార్వభౌముడు శ్రీ కృష్ణదేవ రాయలకు సర్వ విధముల సతీర్థ్యుడీ కవితల్లజుడు. కృతికర్త. కృతిభర్త. కవి పండిత పోషకుడు. వాగ్గేయకారుడు. 'రఘునాథమేళ' రాగ ప్రస్తార కర్త. అందులకే అతని సర్వజ్ఞత్వమును కవి చౌడప్ప ఇట్లు ప్రస్తుతించినాడు.

'నేరుతు నని మాటాడఁగ
వారిజభవు నంత వాని వశమా! తంజా
వూరి రఘునాథ రాయని
గా రెఱుఁగఁ గుందవరపుకవిచౌడప్పా!'

ఈ రాజకవి సంస్కృతాంధ్రముల రెండింటను అపారపాండితీ ప్రకర్షా సమన్వితుడు. సంస్కృతమున రామాయణ సార సంగ్రహము, భారతసార సంగ్రహము, సంగీతసుధ, భరతసుధ ఇత్యాది పెక్కు గ్రంథములకు కర్త. ఇక తెలుగున రఘునాథ రామాయణము, నలచరిత్ర, వాల్మీకి చరిత్ర, శృంగారసావిత్రి, పారిజాతాపహరణము, అచ్యుతాభ్యుదయము, 'రుక్మిణీకృష్ణ వివాహ యక్షగానము, గజేంద్ర మోక్షము, జానకీ కల్యాణము రఘునాథునికృతులు. వీనిలో యక్ష గానాలు, ద్విపద కావ్యాలు, శాస్త్ర గ్రంథాలు. ప్రబంధాలు, పురాణాలు అనే విభిన్న సాహిత్య ప్రక్రియలు ఉన్నాయి. రఘునాథుని కృతులు కేవలము ప్రక్రియా వైవిధ్య ప్రదర్శితములే కావు. రసప్రసన్నములు. ఇందులకు చేమకూర వానిపలుకులే ప్రబల నిదర్శనములు.

'తా రస పుష్టిమై ప్రతి ప
దంబున జాతియు వార్తయున్ జమ
త్కారము నర్థ గౌరవముఁ
గల్గ ననేక కృతుల్ ప్రసన్న గం
భీర గతిన్ రచించి మహి
మించినచో నిఁక శక్తులెవ్వ ర
య్యా, రఘునాథ భూపరసి
కాగ్రణికిన్ జెవిసోకఁ జెప్పఁగన్'

ఒకానొక కావ్య కళావేది కావ్య తత్త్వమును గూర్చి మఱియొక భవ్య భావుక శిఖామణి యొసగిన కత పత్రమీ పద్యము. రఘునాథుని కృతులను ఏపాటి వీక్షించినను పై వాక్యములు సత్యమని పించకపోవు.

కాగా రఘునాథుని ఉపలబ్ధ కృతులలో వాల్మీకి చరిత్రము అగ్రేసర భాసమానము. రఘురాముని చరిత్రమునకు ఆదికవి అక్షరరూపము కల్పింపగా, ఆ ఆదికవి జీవితాకృతికి నిలువెత్తు టద్దమును నిల్పి నాడీ రఘునాథుడు. కవితావతార ప్రథమ తీర్థమై, పరమ పవిత్ర మగు రఘురాముని చరిత్రమును మధుర మనోజ్ఞ కావ్యముగ సంతరించి కవికుల ప్రథమ తీర్థుడై విలసిల్లిన వాల్మీకి చరిత్రమును రఘునాథ రాయలు తనఅలోకసామాన్య ప్రతిభతో దివ్యప్రబంధముగ ప్రపంచించినాడు. సంస్కృతమున ధర్మ ఖండ వాసిష్ఠ రామాయణ, భక్త విజయకావ్యములందలి వాల్మీకి గాథ నాధారముగఁ గొని స్వోపజ్ఞపు శాణోపలమున మనోజ్ఞమగు జాతి రత్నముగ తీర్చి దిద్దినాడు.

క్షీర సాగరశయనుడైన శేషశాయిని సేవించి సప్తర్షులు సప్తద్వీప, సప్తకుల పర్వతములను దాటి, తామ్రపర్ణి చెంగట గల గజతీర్థమున స్నాతులై, ధనుష్కోటి రామలింగేశ్వరుని దర్శించిరి. మధుర యందలి సోమ సుందరుని సేవించి, శ్రీరంగశాయికి కైంకర్యంబు గావించిరి. తంజావూరు, కుంభ కోణము, శ్రీముష్ణము, చిదంబరము దర్శించి, శ్రీ తిరుపతి క్షేత్రమున శ్రీ వేంకటేశ్వరుని వీక్షించి, సత్య గుణాన్వితుడైన శ్రీశైల మల్లికార్జునుని సేవించిరి. వింధ్యదాటి గ్రీష్మాగమన వేళకు వారణాసిఁ జేరిరి. విశ్వనాథుని భజించిరి. గ్రీష్మర్తు తాపాను తప్తులై తమసానిమ్నగను జేరి గ్రుంకులిడు తరి కటిక కిరాతుడొకడు ఎదురుపడి వారిని హింసింప ప్రయత్నింప, వారి మంత్ర ప్రభావమున నాతని క్రూరనారాచము లన్నియు వ్యర్థమగును అంత వారు దయాళులై యాతనికి జ్ఞానోదయము గలిగించి, రామ మంత్రోపదేశ మొనరింప నాతడు అతుల నిష్ఠాగరిష్ఠుడై తప మాచరించును. ఇంద్రుడాతని తపస్సును భగ్నము చేయ రంభోర్వశులను పంపగా వారు విఫల మనోరథలై వినువీథి నేగిరి. అతని తపో నిష్ఠకు మెచ్చి సప్తర్షులు, శ్రీరామ చంద్రుడు ప్రత్యక్షముకాగా, వల్మీకము వలనై యందుండి బయలు వెడలుటచే 'వాల్మీకి' యయ్యెను భగవదాజ్ఞగా రామచరితమును సంస్కృత వాణి మేలుకై యొనరించి యశశ్శరీరుఁడైనాడు వాల్మీకి. ఇదీ ఇతివృత్తము.

ముక్తి సుందరీ యౌవన మగు బదరీవనమున శౌనకాది మహర్షులు హరిస్మరణ

చిత్తుడై యుండ నొకపుడు, నారదు డేతెంచెను. మునులు నాగేంద్రశయాను పుణ్యకథలు వివరింపు మన నాతడు తన సఖుడగు పర్వతుని వందులకు నియమింప నాతడా మౌని వరేణ్యులకు నీవాల్మీకి చరిత్రమును వీనుల విందుగా జెప్పె నని రఘునాథరాయల కల్పన. ఈరీతి నీయితివృత్తమున కొక పౌరాణిక ప్రతిపత్తి కల్పింపబడినది.

ముచ్చటగా మూడు వాక్యములలో జెప్పుటకు తగియున్న ఈస్వల్ప కథను గ్రహించి రఘునాథుడు మూడాశ్వాసముల ప్రబంధముగ నొనరించినాడు. మొదటి రెండాశ్వాసములందు సప్తర్షులు సందర్శించిన పుణ్య క్షేత్రములను విపులముగ వర్ణించినాడు. ఆసేతు శీతనగము గల పుణ్యక్షేత్రము లన్నియు సురుచిరముగ వర్ణితములు. వాస్తవమునకు ఈ వర్ణనలు ప్రబంధ కథా శరీరమును సాగదీసినవే కాని మూలకథకు అంతగా ఉపబలకములు కావు. దీని వలని ప్రబంధ వస్త్వైక్యము బొడు గలచినది కూడ. ఐతే ఇందును ఒకానొక విశిష్టత లేకపోలేదు. వర్ణించిన ప్రతిక్షేత్రము రఘునాథ రాయలు ఇంచుమించు దర్శించినదే. దీని వలన కావ్యమునకు నైసర్గిక శోభ కలిగినది. ఈదీచి క్షేత్రములలో నొక్క వారణాసి తప్ప తక్కిన వన్నియు దాక్షిణాత్యములే. ఈరీతిగ నాతడు తన ప్రాంతీయాభిమానమును జాటినాడు. అయితే 'ఏకమే వాద్వితీయం' అను నభేద ప్రతిపత్తితో శివకేశవా భేదమును సప్తర్షి కృత పుణ్య దర్శన వ్యాజమున పాఠకులకు ప్రవచించినాడు. ముఖ్యముగ ఆంధ్రదేశస్థమగు శ్రీశైల మండలిమల్లికార్జునుని వర్ణించి 'శ్రీశైలశిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే' అను నాభాణకమునకు సార్థకత కల్పించి నాడు. చూడుడు.

'చుక్కలదొర యొకించుక నిక్కశిరసున,
 పదినూఱు చెంగలు వాగఁ జుట్టి
తెలుచు వెన్నెలలీనుదళుకు నెమ్మోముపైఁ
 దొలఁపల్కులీనెడు తోడవు వెట్టి
ముద్దుల జింక ముమ్మొన పోటు ముట్టైను
 సరవితో రెండు హస్తములఁ బట్టి
పెళ పెళ మను చెఱుంగుల రంగు లడరెడు
 మూఁడు వన్నెల పట్టు మొలను గట్టి
కేళ్లుఱుకుము త్రియుఁపు జాయ గిబ్బనెక్కి
చారుతరహార శృంగార హారి యగుచు
ధారుణీధర రాజనందనయుఁ దాను
నమ్మునీంద్రుల మ్రోల ప్రత్యక్షమయ్యె.'

స్వభావోక్తి సుందరముగ సాగిన ఈ వర్ణన రఘునాథ రాయల పరమత సహిష్ణుతకు ప్రబల నిదర్శనము. కాగా ఈతని క్షేత్ర వర్ణనలో గమనింపదగిన యింకొక యంశము సప్తర్షులు సందర్శించిన క్షేత్రములలో తంజావూరు కూడ నొకటి యగుట. అన్నగరీలనామ సౌందర్యము:

'అందలి సౌధ యూథముల
యందము నచ్చటి కేళికావనీ
బృందము చంద మాకెళవ
బింకపుఁ, జూపుల కోపు లించగా
నిందుముఖుల్ నటించు వగ
లెల్లఁ గనుంగొని పొంగి యౌర! పు
రందర పట్టణంబె యిది
రామది రాజిలె నంచు నెంచుచున్'

మఱియు 'ప్రాంత కాంత కవేర కన్యాంబు ధన్య వివిధసస్య ప్రశస్తయై వెలయుచుండు, నట్టి తంజాపురంబును' మునులు కన్గొనిరి. ఇది రఘునాథరాయల నాటి తంజాపూరనుటలో నెట్టిసందియము లేదు. అసలు స్థానిక ప్రకృతి చిత్రణమున రసపరవశుడైనకవి కవితాసనాథుడు శ్రీనాథుడు. భీమఖండమున గోదావరీ తీర కేదారసీమలు, కదళీవనములు, పుండ్రేక్షు భూములు; కాశీఖండమున ఆంధ్రదేశము, దక్షారామవన వాటిక, చాటువులందలి పలనాడు సీమ అట్టిచిత్రణకు అద్యనిదర్శనములు. తదుపరి శ్రీకృష్ణ దేవరాయల మధురానగర వర్ణనము, విల్లుపుత్తూరి వర్ణనము ద్రావిడ దేశ నైసర్గికములే. ఇక రఘునాథరాయల వాల్మీకి చరిత్రలోని తంజాపుర వర్ణనము, అందలి గుడిగోపురములు, పూలతోటలు, శాలిధాన్య విశేషములు, నారికేళ వనములు, చెఱుకుమళ్ళు సర్వము తంజాపూరి నగర సహజ సౌభాగ్యములే.

కావ్యాంగములలో అష్టాదశ వర్ణనములు సాంకేతికములు వర్ణనలు కావ్య కథాసౌధాంగణమునకు రంగవల్లులు. కవి పుంగవుల నిపుణోపజ్ఞకు నికషోపలములు. వీకావ్యము వందైను వర్ణనలు రసోపస్కారకములు, కథాగమనమున వుత్కర్షాపాదకములు, ఔచిత్య పూరితములునై యుండవలయునే కాని కేవల లక్షణానుసరణములై యుండరాదు. రఘునాథరాయల గ్రీష్మర్తు వర్ణనము ఈవాక్యములకు భాష్యమువలె సాగినది. 'ఆకాశీశ్వరు తార్తీయైక విలోచనమునందు నెసగెడు సెగలే పైకొనియె ననగ లోకం బాకల పడదోచె గ్రీష్మమతి భీష్మంబై' అనినాడు. 'ఆకల బడదోచె' ననుట స్వభావోక్తి రమ్యము. అంతేకాదు. ఆమ్రేడితములచే పాఠకుల మనస్సులలో గ్రీష్మోద్ధతిని ఆమ్రేడించినాడు.

'పట పటఁ బగిలెం గుంభిని
తటతటఁబథికుల మనంబు తల్లడపడియెన్
చిటచిట సెగసెన్ దవశిఖి
కటకట గ్రీష్మ భాకింతఁకన బడునంతన్'

రఘునాథుని పరిశీలనాదృష్టికి నిదర్శనమీవర్ణన. అంతేకాదు.

'బడి చనుదెంచు చాయ ధరఁ
బాంథుల తాపము తీరనక్కడ
క్కడఁ దరుజాల మూలములఁ
గ్రమ్ముచు నిల్వఁగ దాని గ్రుచ్చుకో
వడిఁ గరపాళి యొత్తి దిన
వల్లభుఁ డల్లన సాఁగె నాఁగ న
య్యెడ నతి దీర్ఘ భావము వ
హించె నహంబులహో మహాగతిన్'

రఘునాథుని భావ భాగీరథీ తీరమున సుందర తీర్థ మీవర్ణన. వర్ణ్యము యొక్క బహిరతః స్వరూపములను సురుచిరముగ

దర్శించుట ఈతని కవితకు నైసర్గిక గుణము నుటకు పైపద్యమందలి సురుచిర భావమే నిదర్శనము. ఈరీతిగ గ్రీష్మవర్ణనము సుదీర్ఘముగ సాగినది వాల్మీకి చరిత్రలో. సుదీర్ఘమైనను పాఠకులకు విసుపు కల్పింపదు. ఇందు కాతని పరిశీలనా పాటవము, అచుంబిత భావనాపటిమ హేతు భూతములు.

కాగా ఈతని క్రాంతి దర్శిత్వమునకు బోయపల్లె వర్ణనమును లక్ష్యమే. ఆంధ్ర సాహిత్యములో ధూర్జటివలె బోయపల్లియ వర్ణనమును కావించిన కవులు లేరనుట సాధారణము. రఘునాథరాయల బోయపల్లె వర్ణనము ధూర్జటి వర్ణనకు పందెము చరచునది.

'తోరణంబులుగ వీధుల నారc గట్టిన
యుప్పు గండులకు నొండొండ దిరుగు
పురుగుల బెక్కుగాడ్పులc జాల సెగ సెడు
పసరంబుc బొలకంపు ముసురుకొనగ
బసివట్టి నలుగడc బఱచిన మెకముల
పచ్చి తోళ్లను బండ్లc గ్రుచ్చి పెలుకు
బలు జాగిలంబుల భౌభౌరవంబులc
గొంకి పంకములోన ఘుర్ఘురించి
పరువులిడు సూర్పందుల ముఱికి గవులు
చేప తట్టలc గదురుతోc జెనసి చుట్టc
గూcత వెట్టిన జనులవారోలుపc జేయ
భయముగొల్పెడు నొకబోయపల్లె'గాంచి'

స్వభావ సిద్ధమగు నీవర్ణన 'రవిగాంచని చో కవి గాంచునే కదా!' యను కవి తోక్తికి ఉదాహరణము. లేనిచో తిమహారాజ భోగము లెక్కడ? ఈబోయ పల్లె యెక్కడ. హస్తిమశకాంతరము. కవిత ఆ అంతరమును నశింపజేసినది కదా!

ఆంధ్రబంధములు సాధారణముగ శృంగార రస మహితములు. అది రస రాజము. ఆ రసపోషణము సద్యోహృద్యము. సహృదయ నైవేద్యము. రఘునాథ రాయలును బోయ మిటారి కత్తియల శృంగారమును రమ్యముగాచిత్రించినాడు. మగువలు తమ మగలకైపరితపించు పట్టులు తపోదీక్షితు డగు వాల్మీకికి శబరులు ప్రబోధించిన సన్నివేశమిది.

'బోయ మిటారి కత్తియలు
పున్నమ వెన్నెల బైట నీపయిం
బాయని బాళి కిన్నెరలు
మాటికి మీటుచు నీప్రతాపమున్
హాయని చొక్కి పాడ విన
వా? కనవా? మన వారిc బాసి నీ
వీయెడ నొంటి నుండ దగ
వే? తగవే? చనుదెమ్ము వీటికిన్,'

అశ్లేబుషులు వాల్మీకికి జ్ఞానోదయము కలిగించు పట్టుల శాంతరస పోషణ కన్పట్టును. 'రాత చేసిరే కిరాతా' యని ఋషులు బుద్బుద ప్రాయమగు జీవిత స్వరూపము నిట్లు వివరించిరి.

'ప్రాయము జలకల్లోల
ప్రాయము కాయంబు నస్థిరంబిందులకై
రోయక దురితమె తప మని
పాయక చేసెదవు నింద పరగc బుళిందా!'

అశ్లే బోయవీటికి రమ్మను శబరులకు తపోనిష్ఠుcడైన వాల్మీకి ఇచ్చిన సమాధానములోను శాంతరస స్ఫూర్తికలదు.

'సతు లెవ్వరు? సుతు లెవ్వరు?
హితు లెవ్వా రేటివలద నెందేనొకచో
జతగూడిన కాష్ఠంబుల
గతినించుకగూడి విచ్చికదులుదురవలన్'

ఇందు రసపోషణతో పాటుమన తత్త్వ మర్మజ్ఞతయు తొణికిసలాడు చుండుట సహృదయ విదితము.

కాగా రఘునాథుని వాల్మీకి చరిత్రలో కొలది తావుల పూర్వకావ్యాను సరణము, శ్లోకాను సరణము గన్పట్టును. ముఖ్యముగ

'యత్ర యత్ర రఘునాథ కీర్తనం
తత్ర తత్ర కృత మస్తకాంజలిం
బాష్పవారి పరిపూర్ణ లోచనం
మారుతిం నమత రాక్షసాంతకమ్'

అను శ్లోకమునకు రఘునాథుని అనువాదము ఉత్తమోత్తమము.

'ఎక్కడ రామకీర్తన మొ
కించుకయే విన నైన వేడ్కతో
నక్కడ వచ్చి రంజిలి కృ
తాంజలియై ప్రమదాశ్రు పూరముల్
పిక్కటి లంగ మైcబులక
బృందము జాదుకొనంగc బాడుచున్
జొక్కుచునాడు నయ్యనిల
సూనుc బ్రభూనత భాను గొల్చెదన్.'

అశ్లే -
'పంకజ బంధు బింబస్థాయి త్రైలోక్య
మంగళదాయి శ్రీరంగశాయి'
అనుపద్యము కవి కర్ణరసాయన కర్త సంకుసాల నృసింహకవి కృత
అపవర్గ కాంక్షచే నాకొన్న వారికి
దంగేటి జున్ను శ్రీరంగశాయి'

అను పద్యమునకు అనుకరణము. ఇవి రఘునాథుని ప్రతిభాదారిద్ర్యమునకు కాక ఆ పూర్వకవులపై అతనికి గల ఆదరాభిమానములకు నిదర్శనములు.

కాగా రఘునాథ రాయలు కవితావిషయమున నిర్దిష్టములును, నిర్దుష్టము లును నగు నభిప్రాయములు గలవాడు. ఈతని కను ప్రాసాది శబ్దాలంకారముల యందు గాని, శ్లేషాది అర్థాలంకారముల యందు గాని మక్కువ యున్నట్లు కన్పట్టదు. జటిల పదపటాటోపము, అను ప్రాసల యమక గమకాల నమక చమకాలు, శయ్యాడంబర చండ తాండవము అతని కవితకు వెలిచవులు. 'రసపరిపాటి దేటమాటల గవిత్వము ఘటియించు' వారే

(తరువాయి 13వ పేజీలో)

# ప్రకృతి ప్రస్థానంలో 'ముసాఫర్లు'

డా॥ జి. బి. ఎస్. ఆచార్య, ఎం. ఏ. పిహెచ్. డి.

జాషువ గారు "ముసాఫర్లు" అను గ్రంథమును తమ వృద్ధాప్యములో రచించినారు. ఇహమునకు, పరమునకు ప్రయాణించు రెండాత్మల సమావేశమే ఇందలి కథావస్తువు. అద్యతన ప్రపంచ వ్యవస్థ దిజ్మాత్రముగా ఇందు వర్ణితమైనది. వయస్సునకు తగినట్లుగా ఇతివృత్తము నెన్నుకొనుటయందును, భావవ్యక్తీకరణము నందును, కవిగారెంతయు ఔచితిని పాటించి రసజ్ఞుల మెప్పువడసినారు. ఈ కావ్యరచనకు ప్రేరణను గూర్చి చెప్పుచు, "శ్రీ ఏకాగారి గోష్ఠి ఆత్మక్లేశాలకు దివ్యౌషధం. అనుభవజ్ఞుల కీమాట అత్యుక్తి కాదు. వారొక ఛలోక్తిసాగరం. మూర్తీభవించిన ఆనంద పుంజం. అలంకార శాస్త్రరీత్యా ధీరలలితులు. ప్రమత్తమై పడియున్న నా కవితాకళను మేల్కొలిపి నన్నీ కావ్యసృష్టికి పురికొల్పిన వారికి నా ధన్యవాదాలు" అని తమ కృతజ్ఞతలను తెలియజేసినారు. ఈ కావ్యసృష్టికి మరొక ప్రధానమైన ప్రేరణ కలదు. దానిని ఈ క్రింది విధముగా పద్యరూపమున తెలియజేసినారు.

"ఇంటికి వచ్చి కబ్బమెది
యేని రచింప దలంచి మెల్లగా
గంటము బట్టి వస్తువున
కై తలపోయుచునుండ మాకు ప్ర
క్కింటి విస్నాత దంపతుల
కింపు జనింప జనించె కల్మషం
బంటని ముద్దుపాప మధు
రాకృతి నాకొక కావ్యవస్తువై".

తమ కావ్యరచనకు ప్రత్యక్షముగా ప్రేరణను కల్పించిన ఆ పసిబిడ్డను కవిగారు కృతి ఆవిష్కరణోత్సవములో సభలోని వారందరకు పరిచయము చేసి, తమ ఆనందమును వెల్లడించినారట. కవిచక్రవర్తి, కవితాసామ్రాజ్యములో విశిష్టస్థానమును సంపాదించుకొనగలిగిన ఆ పసిబిడ్డ అదృష్టము అనన్య సామాన్యమైనది.

వ్యోమ తీరములలో కవిగారు ఊహించిన మరొక తీరు ఊహ ఈ కావ్యములో కనిపించును.

"ఇంద్రధనువు మకుట మింపార నక్షత్ర
రత్నఖచిత మందిరంబునందు
మెరుపుదీప శిఖలు మెరయు వేదికలపై
విశ్రమించి రభ్రవీథులందు".

ఇందులో ఒక అభౌమ స్వప్నదృశ్యము కనిపించుచున్నది. వీరమరణమును పొందిన యొక యోధుడు —

"ఇంద్రధనువులోని యేడు వన్నెలు మేన
నంటి కొంతకాల మాత్మనలరి
తారకా కిరీట ధారియై మెరుముల
పూలతోటలోన వాలె నతడు"

అని వర్ణించినారు. 'తారకా కిరీటము; మెరుముల పూలతోట' అనునవి గొప్ప భావచిత్రములు. విశిష్టతమైన తన రీతిలో నూతనముగా ఆలోచింపగల నవయుగ కవిచక్రవర్తి యొక్క ప్రతిభకు ఇవి నిదర్శనములు. ప్రకృతికి అందముగా బొమ్మకట్టి, సజీవముగా మనముందు నిలుపు విలక్షణమైన కవితాగుణము ఈ కావ్యమునందన్ని చోటుల మనకు కనిపించుచునే యుండును.

"తనువులు లేవు వస్త్రములు
దాల్పని జీవులు వాయుమండలం
బున బృహదగ్ని గోళమున
బొల్చు నొకానొక జ్యోతికిం బ్రద
క్షిణములు సల్పి కొన్ని భువి
కింజనుచుందును నేను నాగతిం
జని తనువుం ధరించి మను
జత్వరుచిం జవిచూచి వచ్చెదన్"

అని క్రొత్తగా నీలాభ్రమును తరించివచ్చు నొక ప్రాణి, వీరమరణమును పొందిన ప్రాణితో పలుకును. ఆ వీరయోధుడు సర్వేశ్వరునకు, స్వర్గమునకు, అమరకోటికి, రంభాప్రముఖాస్యకు, దిశాధిపతులకు వశల మేనా? అని ప్రశ్నించును.

"మాటకందరాని మరియొక లోకంబు
కలదు మనసులోన మెలగుచోటు"

అని భూలోకమునకు వచ్చు ప్రాణి చెప్పుచు తాను ఎవని శాసనమున ఎక్కడనుండి ఇక్కడకు పయనించి వచ్చెనో నిక్కముగా చెప్పలేడట కాని —

"కనులున్నం గనలేని తీక్ష్ణమగు ను
గ్ర జ్యోతి వెల్గొందు తా
వున నజ్ఞాత జగత్తునం దణువునై
ముందెన్నడో పుట్టిమిం
టను వాతాహతి సంచరించి చిరప్రా
ణంబున్ననుం భూతలం
బునకున్ నెట్టె నెవండో అతడగునే
మో స్రష్ట నా జన్మకున్"

అని తన జన్మకు కారణభూతుని ఊహించినాడు. వీరయోధుని ఆ ప్రాణి ప్రశ్నించుచు "చావదే విధాన సంభవించె?": "అవనిన్ మనుగడ యెట్లుండు?" తెలుపుమని కోరును. అప్పుడు వీరయోధుడు జన్మనిధానమును వివరించి చెప్పుచు — భూలోకమందలి అనేక విషయములను ప్రస్తావించి, అతనికి సదుపదేశము చేయును. వీరయోధుని యుపదేశ బీజకోటి 'క్రమముగా నాతని హృదయరంగమున మొలిచి ప్రబలమై వట్మలించి పుష్పములు దొడిగి పండినిండారి' 'మానవత్వము'ను సృజించినది.

"అతడెదిగి పెద్దవాడై
శతవర్షాయుష్కుడై య
శాశ్వతమగు నీ
క్షితితలము విడిచి చనె శా
శ్వతమగు పరమునకు నొక ము
సాఫరుడగుచున్"

వీరయోధుడు దేహమును విడిచి విద్యుదుజ్జ్వల జ్యోతివలె లేచి అంబర వీథులలో పయనించుచుండగా; ఆప్తులు, బంధుకోటి దుఃఖాతురులై యేడ్చు సమయమున.

ఐహిక బంధములు ఖగములై చేతము నుండి జారి నలుమూలలకు పరచిన వని కవిగారు వర్ణించినారు.

"ఊహింపరాని దగు నొక
మోహన సూక్ష్మాతిసూక్ష్మ
పుష్పనిభంబౌ
దేహమున జొచ్చెనతనిని
రిహాత్మకమైన జీవ
మింపు గొలుపుచున్"

తరగతులు లేక స్వచ్ఛమగు దర్పణము వలె, పారిజాత పుష్పరజముతో విభాసిలి ప్రశాంతముగా ప్రవహించు నొక నిర్ఝరము దరి నున్న చిరత్న నవరత్న కాంతులను వెలిగ్రక్కు నొక మందిరమున అవనీతల దుఃఖమును విస్మరించుచు అతడు విశ్రమింపగా పసిడి రెక్కలతో విహాయసమునుండి ఒక దూత వ్రాలి ఆ యోధుని ప్రక్కగా నిలఁబడినాడు. ఆ దూత చేతిలో ధారుణీ మానవుల జాబితాలు గలిగిన పుస్తక మొకటి యున్నది. 'ఏ మతవర్ణ ప్రముఖుల నామము లివి? వారి కిం దిసాములు లేవా?' తెలుపుమని ఆ యోధుడు కోరగా—

"లేవిట వర్ణ భేదములు
లేవిట నెట్టిమతాలు సత్క్రియా
పావన మూర్తులే యిట ని
వాస మొనర్తురు డాంబికాల కిం
దావు లవంబు లేదు కల
తత్త్వము చెల్లదు చెల్లునే మొ పృ
థ్వీ వలయంబునందు నవి
వేరులు గీచిన పుస్తకాలలో"

అని ఆ దూత సమాధాన మిచ్చి స్వీయ దేశరక్షణకై యుద్ధరంగమున ఉసురులు అర్పించి ఇటకు వచ్చిన నీవంటి దేశభక్తి పరతంత్రులకు గూడ స్థలము చూపగలది ఈ స్వర్గసీమ; అని స్వర్గసీమలో ఆ యోధునకు స్థానమును కలిగింపగా; సంతోషముతో దేవగాయకులు ఆ వీరయోధుని కీర్తిని గాన మొనరించినా రని కవిగారు తమ కావ్యమును ముగించినారు.

ఈ కావ్యములో జాషువగారు ప్రతిపాదించిన 'ప్రకృతితత్త్వము'ను పరిశీలించిన పిమ్మట వీరు గొప్ప ఆస్తికులుగా మనకు గోచరింపగలరు. కాని జాషువగారు ఆచరణలో పూర్తిగా నాస్తికులని శ్రీమతి హేమలతాలవణం గారి అభిభాషణము. ("రచనల్లో జాషువ ఉదార ఆస్తిక వాదిగా కనిపించవచ్చు. కాని ఆచరణలో ఆయన పూర్తిగా నాస్తికుడుగా నాకు కనబడతారు. గోరాగారి పరిచయంతో మా ఇద్దరి నాస్తికదృష్టి మరింత బలపడింది." 'మా నాన్నగారు'– శ్రీమతి హేమలతా లవణం. పుట. 23) కవిగా కొన్ని బలహీనతలకు లొంగి రచనలలో ఆస్తికతను ప్రదర్శింప వలసి వచ్చిన దని జాషువగారె తమ కుమార్తెతో చెప్పుకొని నట్లు ఆమె "మా నాన్నగారు" అను పుస్తకములో వ్రాసినారు. ఏది యేమైనను జాషువగారు భగవంతుని పేరిట జరుగుచున్న అత్యాచారములను, ఆడంబరములను, ఖండించిరే కాని, భగవంతుని ఉనికిని మాత్రము త్రోసిపుచ్చలేదు. కవి ఆత్మీయత కావ్యములలో కొంతయైనను ప్రతిఫలించును గదా! మానవతావాదులుగా, సంఘసంస్కరణాభిలాషులుగా, నిలిచి, తమ లేఖినిని దివ్యాయుధముగా నుపయోగించి ఆధునికాంధ్ర సాహితీ రంగమున స్వైరవిహార మొనర్చినారు. కరుణారసమును పోషించినను, ప్రకృతి తత్త్వమును ప్రతిపాదించినను జాషువగారు మానవతా దృక్పథమును, సంఘసంస్కరణాభిలాషను మరువక తమ విశిష్ట వ్యక్తిత్వమును నిలుపుకొన్నారు. వారు ఆధునికాంధ్ర కవులలో అగ్రస్థానమును సంపాదించు కొనగలుగుట కిదియే ఆలంబనమై నిలిచిన దని చెప్పవచ్చును.

("జాషువకృతులు : సంప్రదాయము–నవ్యత" అను నా అముద్రిత పరిశోధన గ్రంథమునుండి ఇందులోని విషయములు గ్రహింపబడినవి. పరిశోధన పర్యవేక్షకులైన డా॥ చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి గారికి, పిహెచ్. డి. పట్ట మొసంగిన ఆంధ్రవిశ్వవిద్యాలయాధికారులకు నా కృతజ్ఞతాంజలులు.) *

(11 వ పేజీ తరువాయి)

అతని దృష్టిలో మేటి కవులు. మరియు ఉత్తమ కవితారీతి ఇది అతని దృష్టిలో.

'చెప్పవలె కప్పురంబులు
కుప్పలుగా బోసినట్లు, కుంకుమపైపై
గుప్పిన క్రియ, విరి పొట్లము
విప్పిన గతి ఘుమ్మనగ కవిత్వముసభలన్'
'చెవులకు జవులై చల్లగ
గవులకు దవులై, సమస్త కార్యకళా బం
ధువులై రస సింధువులై
యవురా!యనఁగవిత లవని నలరగవలదా!'

కవితను పరిమళ ద్రవ్యములతో పోల్చుట యొక విశిష్టత. కుంకుమ, కర్పూర పుష్ప సౌరభమువోలె కవితా సౌరభమును తనకు తానై దశదిశాపరివ్యాప్తమై సహృదయ హృదయంగమము కావలెనని అతని అభిభాషణము. పరాగ రంజితమైన మాటల తేట, రసవంతమైన కవితారచన - నిక్కమైన కవిత్వము. ఈ రీతితో విలసిల్లినవి గనుకనే రఘునాథ రాయల కావ్యములు రసికజనులకుఅమృత చషకములైనవి.

చివరగా రాజకవి యగు ఈ రఘునాథరాయల కవిత్వము మృదుమధురపద సంయోజితము. ప్రసిద్ధ ధారాధునీ కలితము. ఇయ్యెడ కళాప్రపూర్ణ నిడదవోలు వేంకట రావు రావుగారి పలుకులు స్మరణీయములు 'పుట్టతేనియ పోలిన నిట్టలంపు తీయందనము, తెనుఁగుబాసయందు బుట్టి బుట్టువు మనుగడను నీరాచ కేసరి వ్రాసి తనుగొల్చువేల్పునకు నీకబ్బ కన్నియనిచ్చి యెల్లవేళల దెనుఁగువారిలో నెల కొనిన పేరు గడించినాఁడు ... 'ప్రత్యక్షర సత్యములీ పలుకులు. అందులకే ధన్యుడు రఘునాథరాయ కవి మూర్ధన్యుడు. కవితా ప్రియంభావుకులకు కలకాలము మాన్యుడు.

'ఆ నో భద్రా క్రతవో యన్తు విశ్వతః'

— ... —

# ఒక చిలుకముక్కులో ఇరవై ఇంద్రధనుస్సులు

— శ్రీ సోమసుందర్.

ఈ గోరిల్లా ఒక దివ్యమంగళమూర్తి, మానవజాతికి పితామహుడు. అతని నేత్రాలు అగ్నిగోళాలు. అతడు మహాపురుషుడు. ప్రత్యాలీఢభంగిమలో నిలచి, విశ్వరూప సాక్షాత్కారమీయగలడు. రామలక్ష్మణులకు విశ్వరూప సందర్శనమిచ్చిన హనుమంతునివలె; అతని పిల్లలు దౌర్జన్యానికీ కృత్రిమత్వానికీ గురిచేయబడిన దేవతలు. భూమి యౌవనారంభానికి జన్మించిన వాడతడే! క్రూరజంతువులను వేటాడి వధించినవాడు. ఆగామి మానవపథాన్ని నిష్కంటక మొనర్చినవాడు. ఆగొరిల్లా ఎవరో కాదు. మనిషిలో నిద్రాణమైవున్న క్రియాశక్తి! సూర్యచంద్రాదుల దర్శనం ప్రథమతః చేసుకోగలిగిన అద్భుతవ్యక్తి! కనక అతడు ప్రళయ ఝంఝలూదగలడు. అతడు నిద్రించడానికి వీలులేదు. అతడు నిద్రపోతే-పొలాలు నిశ్చేతనంగా పడి ఉంటాయి. పొగగొట్టాలు ఖాళీగా నిలబడిపోతాయి. కనక ఆ కర్మయోగి కావాహన చేస్తున్నాడు కవి. అతని మహాద్వారం దగ్గర నిలచి తానీ పాటలు పాడుతున్నాడు; ఆ మహాశక్తిని మేల్కొల్పడానికి... తన పాటలన్నీ ఆ మహాపురుషుని పాదాలపై అర్ఘ్యమర్పించడానికే.

ఆ మహాపురుష ఆవాహనలో ఈ కావ్యమంతా ఒక అధునాతన ఝంఝూమారుతంగా వీచుతుంది. ఆ మహామారుతికి స్వాగతాంజలి ఘటిస్తుంది. భరతవాక్యంతోసహా ఇరవైఅయిదు సర్గలుగా సాగిన ఈ మహాకావ్యం- ఆద్యంతమూ వీరరసాన్ని అనలద్రవంలా ప్రవహింపచేస్తుంది. ఈ కావ్యం ద్వారా సాక్షాత్కరించే ఈ కవి హృదయమొక అనిమిష వేదనాక్షేత్రం. అందలి ఒకొక్క కేంద్రంనుంచి ఒకొక్క భావనాబీజం అంకురిస్తుంది. పతిత్ప హృదయక్షేత్రంలోనికి ఒక మహాకృతి గల వృక్షరాజంగా విజృంభిస్తుంది. భూమ్యాకాశాల్ని బంధిస్తుంది. భూమి యథార్థం; ఆకాశం ఆదర్శం! కనుకనే భూమి తల్లి; ఆకాశం విశ్వాసయుతమైన పితృశక్తి. ఈ రెంటినీ ఒకే కేన్వాసులో బంధించి, ప్రదర్శించే ఉత్తమకావ్యం గోరిల్లా! ఆధునిక కవితారంగంలో ఉత్తుంగ నవతరంగ మిది!

అతిమానుష పాత్రనో, లేదా, 'అమానుష' పాత్రనో ఒక ప్రతీకగా నెలకొల్పి ఈ కావ్యం నిర్వహించబడిన దక్షతను పరిశీలిస్తే-రిల్కే మహాకవి ఉపజ్ఞ గుర్తుకు వస్తుంది. (Rainer Maria Rilke: జర్మన్ మహాకవి.) రిల్కే కూడ ఇలాంటి అతిమానుష పాత్రను సృష్టించాడు. దానిని సర్వప్రతీకగా ప్రతిష్ఠించాడు. "Rilke found his symbol for deep continuous consciousness in the half human, half devine figures of hero and angel· అన్న ఒక విమర్శకుని అభిప్రాయం గోరిల్లా పాత్రకు సరిగ్గా సరిపోతుంది. స్పెయిన్ మహాకవి గర్షియాలోర్కా కూడ ఇలాంటిపాత్రనే సృష్టించాడు. నిద్రాణ మానవ చైతన్యానికి ప్రతీకగానే నెలకొల్పాడు. అతని పాత్ర నగర జీవన సంక్షోభంనుంచి ఉద్భూతమై, ఆ వైషమ్యాన్ని తిరస్కరిస్తుంది. లోర్కా పాత్ర చిత్రణ గురించి ఎడ్వర్డుహానిగ్ అనే విమర్శకు డిలా అంటాడు. "Lorca's characters have the spontancity of speech and poetic imagination which grows out of the heart of a folk untouched by perversities of city life-shifts the stylistic emphasis very often from the prosespeech of the characters to the verse and bright design of spectacle and musical conception...."

లోర్కా పాత్ర చిత్రణ ప్రధానంగా నాటకాలలో జరిగింది. ఆయన సహజంగా కవి కావడంవల్ల నాటకరచనలో కూడ కవితావేశమే ప్రాథమికమూ, ప్రధానమూ అయింది. పై ఇరువురు యూరోపియన్ మహాకవులలో శేషేంద్ర పాత్రకు సాదృశ్యం చెప్పడం- వారి నీ కవి అనుకరించా డని చెప్పడానికి కాదు. ఈ పాత్రను గురించి మన విమర్శకులు వెలిబుచ్చిన సంశయాలను పరిష్కరించడానికే! గోరిల్లా కేవలమొక కావ్యస్వరూపంగా ప్రదర్శితమైంది. అందునా యిది కథన కావ్యం కాదు; కథనంలోని వివిధ సన్నివేశాలలో ఒక పాత్రశీల పరిశీలన సునిశితంగా నిర్వహించబడే సావకాశ ముంటుంది. ఒక పాత్ర ఆద్యంతమూ మూర్తిమంత మవుతుంది. అలాంటి అవకాశంలేని ఆధునిక వర్ణనాత్మక కావ్యంలో పాత్రచిత్రణ ఆనుపూర్విక పద్ధతిలో సాగేందుకే వీలు లేదు. కనక ఆ పాత్ర పరిశీలన విషయంలో కూడ మన తులాదండాలు మార్చుకోక తప్పదు. ఈకావ్యం అధ్య

యనం చేస్తున్నపుడు మన మనస్తలంలో సజీవ శక్తితో మిగిలిపోయిన పాత్ర ఏమిటి? దాని రూపరేఖావిలాసాలేమిటి? అది కలిగించిన రసానంద సాంద్రత ఏ తీరున ఉన్నది? అనే ప్రశ్నలకే సహృదయుడు సమాధానం చెప్పుకోవాలి!

ఈ ఇరవై అయిదు సర్గల కావ్యంలోనూ 23 వ సర్గవరకూ గోరిల్లా ప్రసక్తి పదిహేడు మార్లు వస్తుంది. పతాక సన్నివేశాన్ని కూర్చేది కనక ఒక్క ఇరవై నాలుగో సర్గలో మాత్రం దాదాపు ప్రతి వాక్యంలోనూ గోరిల్లా ప్రసక్తి వస్తుంది; సంబోధనగానో, అభిభాషణంగానో.

పీడిత మానవజాతిలో నిద్రాణమై ఉన్న క్రియాశక్తికి ప్రతీకగా ఈ కావ్యంలోని గోరిల్లా ప్రతిష్ఠింపబడినపుడు – ఆ ఐకాంతిక పాత్రకు పోషకంగానే సర్వేతర కవితాంశాలూ పరిభ్రమించకతప్పదు. ఆధునిక సంవిధానంతో సంవర్ధితమైన ఈ కావ్యం–పరిశీలింపబడేటప్పుడు సాంప్రదాయిక కావ్య ప్రమాణాలూ మానదండాలూ పూర్తిగా నిరుపయోగాలు కాక తప్పదు. పాశ్చాత్యదేశాల ఆధునిక కావ్యసంసారంనుంచే ఈ కావ్యావగాహనకు ఉపయుక్తమైన ప్రతిపాదనలను సముద్ధరించుకోకనూ తప్పదు.

ఈ కావ్యగతమైన ప్రధాన – ఏక పాత్రను గురించిన మన అవగాహనా పరిధిని పెంచుకుందుకు తాదృశమైన పాత్రను సృష్టించిన లోర్కా ఏకపాత్ర-గురించి ఎడ్వర్డుహానింగ్ చెప్పిన మరోవాక్యాన్ని మళ్ళీ ఉల్లేఖించుకోక తప్పదు. "Why his single character it be came possible for him to express pathos and tragedy in terms of the most elemental passions· (Garcia Lorca P-194) అలాంటి కావ్యసిద్ధికోసమే తన సర్వాంగీణ ఆలోచనాధారనూ గోరిల్లా పాత్ర నిబద్ధం చేశాడీకవి. 'ఈ పాత్ర స్వీకారంలోనే ఒక అనవద్యమైన ఉపజ్ఞ ప్రదర్శితమై ప్రశంసాపాత్రం చేస్తోంది. ఈ కృతికి ఒక అపూర్వతను కూడ ఘటింపజేసింది. పూర్వతరాల ఏ తెలుగు కవికీ అనుకరణగాని, అనుసరణగాని కానట్టి సంపూర్ణ ప్రతిభను నిక్షేపించుకొని అవతరించింది. ఈ కావ్య వ్యక్తిత్వం అపూర్వ ఓజస్వంతంగా భాసించింది అందుకే – "You cannot value him (Any Poet) alone, you must set him, for contrast and comparison, among the dead· I mean this is a principal of aesthetic, not merely historical, criticism·" అన్న టి. ఎస్. ఎలియెట్ వాక్యం మనకు మార్గదర్శకమే!

కావ్యనిర్మాణంలో ప్రధాన చోదక శక్తులు రెండే; భావావేశమూ, అనుభూతీని. ఈ రెండూ కావ్యతలంమీద సమాంతరంగా పరచుకోవడం వల్లనే కావ్యానికి పఠనాసక్తీ, స్వయం చలన శక్తీ కలుగుతాయి. పఠితృహృదయంలో చిరంతన ముద్రను పాదుకొల్పుతాయి. (… the presence of the transforming catalyst, or of two kinds-emotion and feeling - T· S· E…) ఈ ఆవేశానుభూతులను అభివ్యక్తం చేయడానికి పదచిత్రాలు, భావచిత్రాలు, ఆనుపూర్వికంగా సిద్ధించిన సర్వాలంకార సామగ్రి వంటివన్నీ గర్భీభూతం చేసుకోగలది శాబ్దిక ప్రపంచమేతప్ప అన్యథా శరణ్యం లేదు కవికి.

ఐతే ఒకకవి – కావ్యనిర్మాణమున్నుద్దేశిస్తున్న తత్కాలంలోనే–ఈ కవితా సామగ్రి యావత్తూ అతనికి సాక్షాత్కరిస్తుందా అంటే చెప్పలేం. ఇట్టివన్నీ అతని మస్తిష్క భాండారంలో ఎప్పుడెప్పుడో సముపార్జితమై నిలవచేయబడి ఉండవచ్చు. కవి నిత్యనైమిత్తిక జీవితంలో అందరికిమల్లేనే బ్రతుకుతాడు. కార్యక్రమాలన్నీ అందరిలాగనే నిర్వహిస్తూంటాడు. కాని అతడేపని చేస్తున్నా దానితో నిమిత్తం లేకుండా అతని హృదయంలో అనవరత అన్వేషణ సాగుతూ వుంటుంది. "రత్నహారీ తు పార్థివః" అనినట్లు, కావ్యాభరణాలను నిర్మించేందుకు ఉపయుక్తమయ్యే రత్నాలను గ్రహిస్తూనే ఉంటుంది. వాటిని సముచితస్ఫూర్తితో కవి వివేచన ఉపయుక్తం చేస్తూ ఉంటుంది. యథాయథా కావ్యనిర్మాణం కొనసాగిస్తూ ఉంటుందతని సృజనశక్తి.

ఇదే అభిప్రాయాన్ని టి. ఎస్. ఎలియట్ ఎంతో చక్కగానూ సూత్రప్రాయంగానూ వివరించాడు. "The poets mind is in fact a receptacle for seizing and storing up numberless feelings, phrases, images, which remain these-untll all the particles - which can unite to form a new compound are present together…" కావ్యప్రపంచంలో నిష్ణాతులైన వారి అనుభవాలే ఒక కావ్యావగాహనకుపకరిస్తాయి. కనుకనే ఎలియట్ వంటి మాన్యులను మాటిమాటికీ ఉల్లేఖించుకోవలసి వస్తుంది. ఒక రిస్టువాచీలోని యంత్రనిర్మాణం గురించి వివరించమని ఒక తాపీమేస్త్రిని అభ్యర్థించడం వుండేటి కొమ్ముకై వెదకడం వంటిదే కదా! ఒక కవి హృదయం నుంచి ఒక కావ్యం వెలువడిందనగానే అది అమేయ గతంలో కలిసి పోయిందన్నమాటే. ఆ కావ్యంగురించిన విమర్శనిజానికి కావ్యానికి గాని, కవికిగానీ ఏమీ పుష్టిని చేకూర్చదు. ఆ కావ్య పాఠకులైన ఆగామికవులకు మాత్రమే మార్గ

(తరువాయి 18 వ పేజీలో)

### “ఎక్కువ వ్రాయని భాస్కరుడు”

# శ్రీ అజంతా

— శ్రీ కర్రా కార్తికేయశర్మ.

---

కొందరు శరపరంగా కవితలు వ్రాస్తూనే ఉంటారు. కాని వారిపేరు మనకు గుర్తుండదు. ఆ కవితలు మన తలపునకు రావు. మరికొందరు ఏ కొద్దిగానో కవితలు వ్రాసినా, వారిపేరు మాత్రం నిరంతరం మన మనోవీథిలో మెదలుతూనే ఉంటుంది. ఏదో సందర్భంలో వారికవితలు జ్ఞాపకానికి వస్తూనే ఉంటాయి ఈ రెండవ తరహాకు చెందినకవుల్లో అజంతా ప్రముఖులు. ఆయన వ్రాసిన కవితలు 'డజను' కన్నా ఎక్కువుండవు. అయినా ఆధునిక సాహిత్యంలో తనదంటూ ఒక స్థానాన్ని ఏర్పరచుకున్నారు. అందుకే ఆయన 'ఎక్కువ వ్రాయని భాస్కరుడు.'

1929 లో ఆంధ్రదేశం మారుమూల 'కేసనకుర్రు'లో పుట్టిన అజంతా ప్రస్తుతం ఆంధ్రప్రభ దినపత్రికలో ఉపసంపాదకులుగా పనిచేస్తూ, పరుగెత్తే జీవితాలకు నిలయమైన విజయవాడలో ఉంటున్నారు. తను అందంగా ఉండని కారణాన తనలోనికవిని అందంగా పెంచారు. ఆ కవి ఎక్కువ వ్రాయడానికి బద్ధకించినా, వ్రాసినవన్నీ ఉత్తమమైనవి కనుక అందనంత ఎత్తుకు ఎదిగిపోయాడు. ఇదీ అజంతా - కవి-యొక్క సంగ్రహ పరిచయం.

గులక రాళ్ళు డబ్బాలో పోసి గిలకరిస్తూ ఇదే కవిత్వమనే కవులకు ఆయన ఎడంగా నిలిచి, అనుభూతిని, సత్యాన్ని, పునాదిగా చేసుకుని కవిత్వం వ్రాశారు. అందుకే అజంతా కవితా శిల్పం అజంతా శిల్పంలా అందంగా మెరుస్తూ చాలకాలం నిలిచే గుణాన్ని కలిగి ఉంది.

ఆయన వ్రాసిన కవితల్లో ప్రముఖమైనది 'చెట్లు కూలుతున్న దృశ్యం.' ఈ కవిత మంచి వచన కవితకు ఒక ఉదాహరణ. కడుపులో రగిలే బాధలకు, జీవితం అనుభవిస్తున్న వేదనలకు చెట్లు కూలుతున్న దృశ్యం ఒక ప్రతీక.

'ఆశ లేదు ఆస్కారం లేదు
ఫలానారోజు శాపం ఆఖరౌతుం
దనే హామీ లేదు
ఫలానరోడ్డు గమ్యం చేరుస్తుందనే
సూచన ఎక్కడా ఏమీ లేదు
జీవితం ఎప్పుడూ ఇలా
కన్నీళ్ళ ప్రవాహంగానే సాగుతుం
దనుకుంటాను
రోడ్డుపొడుగునా చెట్లుకూలు తున్న
దృశ్యాలనే
చూపుతుం దనుకుంటాను'-

అంటూ నిరాడంబరపదావళితో ప్రారంభమౌతుంది కవిత. చెట్లుకూలుతున్నశబ్దాలు వినబడకుండానే చెట్లను కూల్చడం అజంతాకున్న ప్రతిభల్లో ఒకటి. ఎటువంటి అట్టహాసాలూ లేకుండానిశ్శబ్దంగా కవితను ప్రారంభించడం, గడుసుగా ఆ కవితను ముగించడం అజంతాకు తప్ప మరెవరికి తెలుసు?

'నిరుద్యోగి వెంకట్రావు రోడ్ల మీద
నడుస్తూఉంటే
సమీపంలో ఎక్కడా జనసంచారం
ఉండదు
చెట్లమీద ఆకుసైతం అల్లల్లాడదు
టెలిఫోన్ తీగలలో వార్తాప్రసారం
సాగదు
నిరుద్యోగి వెంకట్రావు నగరం నడివీథిలో
తనజీవితాన్ని తెరుస్తూ ఉంటే
ఎందుకో అకారణంగా సూర్యుడు
ఖిన్నుడౌతాడు
ఆగ్రహం పట్టలేక భూదేవి బ్రద్దలౌతుంది
ధర్మదేవత ఉన్న ఒకకాలూ
విరుచుకుంటుంది'

ఈపాదాలు పరిశీలిస్తే వెంకట్రావు 'మూర్తి' మన కన్నులెదుట సాక్షాత్కరిస్తుంది. 'పాపం వెంకట్రావ్!' అని మనమొక్కసారి అనుకుంటాము. ఆ సానుభూతి మనకు కలగడానికి అజంతా ఎన్నో జాలివాక్యాలు తన కవితలో ప్రయోగించారు.

'నిరుద్యోగి వెంకట్రావు చావడు
చావటం అనే మహాపాపం చెయ్యకుండా
న్యాయాధిపతులు ఎప్పుడూ
అతన్ని కాపాడుతూ ఉంటారు
రోడ్లమీద శిశువులు అతనిలో ఎప్పుడూ
కొత్త ఊపిరిపోస్తూంటారు
జీవిత మాధుర్యాన్ని గూర్చి చీమసైతం
అతణ్ణి హెచ్చరిస్తూ వుంటుంది
నిరుద్యోగి వెంకట్రావు ఎన్నటికీ చావడు'

అతడు చచ్చిపోదామనుకుంటాడు. ఎలాచచ్చిపోవాలో తెలియదు. (కరంటు తీగ పట్టుకుని చచ్చిపోదామంటే కరంటు ఆగిపోతడమో, లేకపోతే ఏపోలీసులో పట్టుకొని ఆత్మహత్యానేరం అని కోర్టుకి తీసుకువెళ్ళడమో ఇలాంటివి చాలా జరిగాయి) ఆకలిలో చచ్చిపోదామంటే, ఎవరో ముష్టివాళ్ళు అతనికి పట్టెడన్నం పెడుతూనే ఉన్నారు. “చచ్చిపోవడానికి కాదురా పుట్టింది” అంటూ అల్ప ప్రాణి చీమకూడా అతణ్ణి హెచ్చరిస్తూనే ఉంది. ఇంక ఏలా చచ్చిపోతాడు వెంకట్రావు ? చావడు. అతడు మృత్యుంజయుడు. అతడి జీవితం చీకటి నరకకూపం వంటిది. అందులోని 'ఆశ్చర్యాలు' చూసి తట్టుకోవడంకష్టం.

“బాధ అనేదీపం పట్టుకొని
సర్వనాశనం అనే తాళంచెవిని పట్టుకొని
వెంకట్రావు జీవితం అనే చీకటి నరక
కూపంలో

భయంకరమైన ఆశ్చర్యాలు ఇంకా అనేకం చూడవచ్చు
జీవితం మీద ఇంకా నమ్మకం ఉన్న వాడు
వెంటనే అక్కడే ఉరిపోసుకొని చావడం ముమ్మాటికీ సంభవం కావచ్చు"

తనజీవితాన్ని తెరిచి అందర్నీ చంపెయ్యగలడు అతడు. తను మాత్రం చావలేడు. దారుణమైన బాధల్ని అనుభవిస్తూ బ్రతకడమే అతనికి శాపం.

"నిరుద్యోగి వెంకట్రావు ఎన్నటికీచావడు
అంచేతనే అందమైన ఈసాయంత్రం వేళ
నగరం అంతటా అపస్వరాలు
వెంకట్రావు నడుస్తున్నంత మేరా చెట్లు
కూలుతున్న దృశ్యాలు"

నిరుద్యోగ మహారాజశ్రీ వెంకట్రావు నడుస్తున్న ప్రతి అడుగుకీ ఒకకూలుతున్న చెట్టు దృశ్యాన్ని చూపిస్తూ కవితాభిమానుల హృదయంలో "ఎప్పటికీ కదలని" విధంగా తిష్ఠవేశారు అజంతా.

"కన్నులతో కాదు
గడియారాలతో చూడు
నారూపాన్ని నీవు చూడవచ్చు
అంకెలమధ్య
అక్షరాలమధ్య
గోడకు వేలాడిన కాగితాలమధ్య
విరిగిన మనో - రథాలనీ
చిగిర్చిన వ్యాధు - లతలనీ
మోసుకొచ్చే ఉత్తరాలమధ్య"

అంటూ క్రొత్తతరహాగా కవితను కొనసాగించారు అజంతా. సాధారణంగా 'కొత్తసంవత్సర'మనగానే కోకిల, మామిడి చిగురు, ఉగాది పచ్చడి, అంటూ పోవు సామగ్రిని తెచ్చికవిత్వాన్ని వండడం ప్రారంభంచేసేఎందరో ఎందరో మహాకవులకు అంజతా విలక్షణుడు.

"రోజూ చూస్తూనే ఉన్నాను" అంటున్నారు అజంతా. ఆ చూసేవేమిటి ?

"కళ్ళవెనక ఉన్మత్త చెట్లను
ఊసర క్షేత్రాలను
ఉద్రేకవంతమైన సరస్సులను
ఉరితీయ బడుతున్న అక్షరాలను"

-అంతేకాదండా

'ఆ కళ్ళవెనుక అప్పుడే భూపతనమైన
ఏమువును
శాఖోపశాఖలుగా వ్యాప్తమయే
కొమ్మక్రింద కన్నీళ్ళలో నిష్క్రమణ
గీతాలను
రోజూ చూస్తూనే ఉన్నాను.'

రోజూ చూస్తూ, నడుస్తూ, అవధారణ చేస్తూ ఆయన కనిపెట్టిన 'సత్య' మేమిటి ?

'ఆకళ్ళ వెనుక దీపం వెలగదు
అక్కడ సంగీతం వినబడదు'

అని, తన భావవ్యక్తీకరణకు 'వచనకవిత' సరియైనప్రక్రియ అని ఆయనగమనించడం హర్షింపతగ్గ విషయం. శ్రీనండూరి రామమోహనరావు అన్నట్లు "అజంతా తన భావాలను చంపకమాలలోనో, మాత్రాబద్ధగేయాలలోనో పొదిగివుంటే వాటిలో స్వారస్యం మిగిలేది కాదు." తను ఎన్నుకున్న ప్రతి కవితావస్తువు విస్తృతమైనది గనుక అజంతా కలానికి వచన కవితే సరియగు వేదిక. ఛందస్సు అవసరం లేకుండా, నిరాడంబరంగా గొప్ప కవిత్వం వ్రాయవచ్చు నని నిరూపించింది అజంతాయే !

మనం ప్రతిరోజూ నిద్రపోతున్నాం. సమస్త మానవులను తన ఒడిలోకి తీసుకుని జోలపాడి విశ్రాంతి నివ్వగల శక్తి ఒక్క "నిద్ర"కే ఉంది. మనం రోజూ అనుభవించే ఆ "సుషుప్తి" గురించి ఎప్పుడన్నా ఆలోచించామా? అజంతా ఆలోచించారు. ఆ సుషుప్తిని కవితగా మలిచారు.

"ఎక్కడా ఎవరూ లేరు అంతా
ఇళ్లు చేరుకున్నారు
విద్యార్థి పుస్తకాలు మూసేశాడు
విదూషకుడు వేషం మార్చేశాడు
వీథి గాయకుడు పాట ఆపేశాడు
ఎక్కడా ఎవరూ లేరు అంతా
ఇళ్లు చేరుకున్నారు"

మనం ఏం చేస్తున్నా - ఎక్కడున్నా ఒక నిర్ణీతమైన సమయానికి ఇంటికి చేరుకుంటాం. అదో నియమం (వ్యక్తులను బట్టి, వృత్తులనుబట్టి నిర్ణీత సమయాలు అటూ ఇటూగా ఉంటాయి కాని ఏదో సమయానికి ఇళ్ళకు చేరుకోవడం తప్పదు గదా!) విద్యార్థి పుస్తకాలు మూసేసినా, విదూషకుడు వేషం మార్చేసినా, గాయకుడు పాట ఆపేసినా, ఆ నియమానికి లోబడే! కాకపోతే ఈ "సుషుప్తి"ని అనుభవించడంలో కొన్ని తరహాలున్నాయి. ధనవంతుడి సుషుప్తి హాయిగా ఉంటుంది. సామాన్యుడి సుషుప్తి కొన్ని ఇబ్బందులకు గురియౌతుంది. పేదవాళ్ళకు సుషుప్తి చెందడం ఒక గడ్డుసమస్యై కూర్చుంటుంది.

"పేవ్‌మెంటుమీద భిక్షుకులు వాల్ పోస్టర్లు కప్పుకున్నారు" ఏం చేస్తారు ? సుషుప్తికి ఏదో ఉపాయం.

జగత్తు మేలుకున్నప్పుడే వ్యత్యాసాలు మేల్కొంటాయి. సుషుప్తిలో ఇరులుండవు గిరులుండవు విశ్వమంతా ఒక నిశ్శబ్ద భవనం.

"హంతకుడికీ బలిపశువుకీ ఇప్పుడు
తేడా లేదు
కురూపికీ స్ఫురద్రూపికీ ఇప్పుడు
తేడా లేదు
మనిషికీ మనిషికీమధ్య ముళ్ళతీగ లేదు
... ... ... ...
ఆశలు లేవు అసూయలు లేవు నిరాశలు
లేవు
నిట్టూర్పులు లేవు ద్వేషాలు లేవు
దురాగతాలు లేవు కష్టాలు లేవు
కన్నీళ్ళు లేవు
అంతటా ఒకే ఒక నిశ్శబ్దం
ఒకే ఒక హృదయస్పందనం" -

అంటూ కవితను ముగిస్తారు అజంతా.

తరతరాల మానవుడి ఒంటరి ప్రవృత్తి, ఎవరికివారే విధానం. అజంతాను కలవర పెట్టి, బాధించి, ఈ కవితను పలికించిందేమో అని నా అభిప్రాయం.

'పరిత్యాగి పరివేదన' అజంతా మాత్రమే వ్రాయతగ్గ కవిత. చిన్నప్పుడే ఇల్లు విడిచి, దేశాలు పట్టి ఎక్కడో సమాంతర రేఖమీద నిలబడ్డ ఒకపరిత్యాగి తన తమ్ముడికి వ్రాసిన ఉత్తరం ఈ కవిత.

'తమ్ముడూ కులాసాగా ఉన్నావా
పోనీ నీవైనా పుస్తకపూజ చేస్తున్నావా
అమ్మనీ నాన్ననీ హింస పెట్టకుండా
వాళ్ళు కన్నీరై ప్రవహించకుండా
పోనీ నీవైనా కుటుంబానికి పేరు
తెస్తున్నావా' -

అని తమ్ముణ్ణి అడుగుతున్నాడు పరిత్యాగి. ఈ అయిదు పాదాలు చదివితే చాలు పరిత్యాగిస్థితి మనకు అర్థమౌతుంది. తనకు లేని అర్హతలు, చేయలేని పనులను గూర్చి తమ్ముణ్ణి ప్రశ్నిస్తున్నాడితడు. తాత్కాలికమైన ఆలోచన మీద నిలబడి దేశాలుపట్టి తననుభవిస్తున్న బాధల్ని వివరిస్తున్నాడు.

'నీకెంతో దూరంగా ఎక్కడో
సమాంతర రేఖమీద నిలబడ్డ నేను
నన్ను నేనే పోల్చుకోలేక నాకు నేనే
సహా ప్రయోజనాల దూరంలో
ఉన్నాను.
ఐనా ఈఅడుగు జాడ ఏసారవంతమైన
శ్మశానం మీద పడుతుందో
ఇంకా నిర్ధారణగా చెప్పలేను' అంటూ

పాపం! ఈ పరిత్యాగి వాపోతున్నాడు. మరోవిచిత్రమైన విషయమేమిటంటే

'ఎవడో హఠాత్తుగా ప్రమాదంలో
చిక్కన్నాడనుకో
చుట్టూ పోగైన జనం ఒక్కసారి
నాముఖంవైపు చూస్తారు
'ఇదేం విచిత్రం ఇద్దరిదీఒకేపోలికే'
అని ఆశ్చర్యపోతారు
నిజం చెప్పాలంటే రోడ్డు మీద
నామృతకళేబరాన్ని నేనే లక్షసార్లు
చూశాను'

-అంటాడు ఈ అన్నయ్య. 'శవంలా బ్రతుకుతున్నా' డని మన చేత అనిపించడానికి అజంతా కూర్చిన విలువైనవాక్యాలివి.

ఆకు చాటు పిందెలా ఉన్న అతడు ఆఆకుల్ని (తల్లిదండ్రులను) కాదనిలోకం మీదకు వచ్చాడు. ఆలోకం అతడికిఎన్నో దృశ్యాలు చూపించింది.

'ఈనగరంలో అడుగు పెట్టినరోజున
మనిషి రాక్షసుడుగా మారడం
కళ్ళారా చూశాను
అంతటా విషవాయువులు-
ఎటుచూసినా పద్మవ్యూహాలు'

ఈ పద్మవ్యూహాలలో చిక్కుకున్న 'జీవితం నిండా శూన్యమే' అని చెప్తాడు.

'ఐనా ఏదో ఆశ
ఒకప్పుడైనా తప్పుకోదా అని ఈనిశ'
అంటూ!
'అమ్మనీ నాన్ననీ ఒక్కమాటు చల్లని
హస్తాలతో దీవించమను
చల్లనివేళ నాకోసం భగవంతుడిని

ఎంతటిపరిత్యాగి అయినా ఏదోఆశను అలంబనగా చేసుకొని బ్రతుకుతాడు. ఆ ఆశ నెరవేరాలంటే, మానవశక్తి చాలదేమో! అని అనుమానం. దైవాన్ని నమ్ముతాడు, తల్లిదండ్రుల ఆశీస్సులు కోరుతాడు. కోరి తెచ్చుకున్న కష్టాలతో, శారీరకంగా- మానసికంగా కమిలి, కుమిలి పోయే ఈ పరిత్యాగి' మన మనస్సున శాశ్వతంగా 'ముద్ర' పడిపోతాడు.

అజంతా తాను వ్రాసిన ప్రతిమాటలోను అద్భుతమైన బొమ్మలు కట్టి, ఆ బొమ్మల్ని లోకం మీదకు వదిలాడు. వదిలిన బొమ్మలు స్వల్పమైనా అవి సృష్టించిన చైతన్యం మాత్రం బహుగొప్పది. ఆజీవ చిత్రాల చిత్రకారుడు అజంతా ఆధునిక కవులలో మొదటి పంక్తికి చెందినవాడు.

—•••—

( 15 వ పేజీ తరువాయి )

దర్శకమవుతుంది. మేలుకీళ్లరయగల బుద్ధి కుశలత నందిస్తుంది. దర్శనశైశిత్యాన్ని కలిగిస్తుంది. అదే విమర్శప్రయోజనం. సామాన్యుల కా కావ్య హృదయాన్ని ఆవిష్కరిస్తుంది.

పైని పేర్కొన్న ఉపపత్తులతో పరిశీలిస్తే - గొరిల్లాకావ్యం ఒక పరిపూర్ణ ప్రజ్ఞానిధిని సాక్షాత్కరింపచేస్తుంది. దాని కిరణసమూహారం రసలోకంలో అపార మాధురీధురీణమై భాసిస్తుంది. ఒక సంపూర్ణ కావ్యం నుంచి ఒకరసజ్ఞుడు ఆశించగలట్టి వన్నిటినీ సమగ్రంగా సుసిర్థం చేస్తుంది. నవీనమూ ఉత్తమమూ అగు ప్రయోగంగా నిరూపించుకుంటుంది. కనకనే ఈ కావ్యం కళాత్మకంగా స్వయం సమృద్ధం (artistic self sufficiency)

ఒక్కసారి అలవోకగా చదివి ఈ పుస్తకాన్ని వదలిన సామాన్యపాఠకుని సైతం విడువకుండా అతని మనసులో సహవాసంచేసే సుందరోక్తులు ఈ కావ్యంలో ఎన్నో ఉన్నాయి. అలాస్థిరపడిన భావశకలాలు తమ ఉనికి పట్లు వెదికి పట్టుకునేవరకూ పఠితకు శాంతి నీయవు.

హృదయంలో చెలరేగే ఆ అశాంతే ఒక అమేయానందానికి నాంది.- ఆకావ్యానందంనుంచే - ఒక చిరశాంతీ, సంతృప్తీ కలుగుతాయి. 'To do the useful thing to say the courageous thing to contemplate the beautiful thing : that is enough for one mad's life' అని టి. ఎస్. ఎలియట్ ఉద్ఘాటించిన జీవన సార్థక్యము కలుగుతుంది. కృతార్థత లభిస్తుంది.

(సశేషము)

# విశ్వనాథతో ఇష్టాగోష్ఠి

— శ్రీ వసుంధరా సుదర్శనులు.

( 20 వ సంచిక తరువాయి )

## మనస్సు స్వరూపం – ప్రపంచం

వ : మీరు మనస్సుకి యింతలోతుల్లోకి పోయినారు గదా. అన్ని మనసులూ ఏకంగా వుండే స్థితిని గురించి ఆలోచించా రాండి?

వి : మనస్సు లెప్పుడూ ఏకంగావుండ వమ్మా! మనస్సులంటే differences. మనస్సుని propel చేసే, వెనకవుండే శక్తియందు ఐక్యముంది తప్ప అది మానసికమైన రూపం తీసుకునే టప్పటికి it differs with individuals, it differs with clime and it differs with time

ఇందాక చెప్పానే నేను, ఫలానా తల్లిదండ్రుల కడుపున వాళ్ళకున్న భాగ్యం యొక్క లక్షణం వీడి భాగ్యంగా పరిణమించే ఒకానొక కర్మ పరిపాకం చేత వాడు అక్కడ పుట్టాడు. ఇలా అనేక మంది పుడుతున్నారు. పుట్టినప్పటికీ in essence వాడు a thing that projects his enerjy but that enerjy is something else. దానికీ దీనికీ సంబంధం లేదు. ఆ enerjy లో part and parcel ఈ mind. Mind అనేది all-grasping quality కల్గిన ఒకానొక వస్తువుగా మనమేధలో వున్నదనే భావం చేస్తున్నాంగనుక, దానికి యింకో చమత్కారంవుంది. At different places it has different according to its worthiness. స్త్రీ పురుష సంబంబంధ మైనది ప్రేమ. ఒకానొక పని చెయ్యదలచుకుంటే ఆపని చెయ్యటానికి సాధ్యం కాకపోతే వచ్చేది కోపం. అది సాధించ డానికి ఎవడో ఒకడు మనకు అడ్డు తగులు తున్నాడని con-tinuous గా కోపం పెట్టుకుంటే క్రోధం ఈ మోస్తరుగా భావములున్నవి గదా, ఈ భావములన్నీ మొట్ట మొదట ఏమిటి? ఏదైతే యిలాంటి శక్తులన్నిటినీ కలిపి చెయ్యటానికి వీలైన వస్తువో అది ఎక్కడో మనస్సు అనుకొన్న చోట, మేధస్సు అనుకున్న చోట, బుద్ధిఅనుకొన్న చోట–అక్కడికి projeetion గా వస్తోంది. ఒక light యొక్క pro-jectiion. ఆ light కి దీనితో ఏమి సంబంధ లేదు. ఆ light యొక్క pro-jection యొక్క different stages యివన్నీను. అంతేకదు. ఈ సంస్కారాలన్నీ యీ stages లో వున్నవి తప్ప ప్రధానంగా లేవు.

వ : అందరు మనుష్యులూ ఒక విషయాన్ని ఒకే విధంగా చూడరు. కొంత మందికి ప్రపంచం మంచిగా, కొందరికి చెడ్డగా, కొందరికి ప్రేమమయంగా రకరకాలుగా కనబడుతోంది. అయినప్పటికీ అందరికీ common గా వుండే ప్రపంచంవుంది. అదేమిటి? నిజానికి ఎవరిలోకం వారిది. అయినా అందరికీ common గా వుండేది ఏది?

వి : ఉన్నది. అదేమిటంటే 'నియతి కృత నియమరహితాం, ఆహ్లాదమయీాం అనన్య పరతంత్రాం' అని వ్రాశాడు మమ్మటుడు, మొట్టమొదటి శ్లోకం తన కావ్యంలో. ఆయన చెప్పే దేమంటే ఈ ఈ ప్రపంచకానికి నియతి ఉన్నది.

ఎందుకంటే ఇదిఒకానొక groove లో నడుస్తోంది. ఆ groove ని నిర్తొలగి పోదు. ఆ ఒక లక్షణం ప్రవం చానికుంది. ఆ మొట్ట మొదటి ప్రాజక్షనే, ఆ పరమేశ్వరుడి శక్తి యీరీతిగా pro-ject అయినప్పుడు ఎప్పుడూ, ఎన్ని భేదాలున్నా ఆ రెండు గోడల మధ్యే పడుతూ వుంటుంది. ఒక మహానది బయ ల్దేరితే ఎప్పుడో నూటికోటికి ఒకచో కోసుకుపోతుందే తప్ప మనం ఎరిగున్నట్టి ఆ కృష్ణానదికి ఆరెండే కట్టలు. వరదొస్తే కొంచెం అవతలికొస్తోంది. తప్ప – Mat seems to be the nature of the elements and the force that directs the elements. అందుచేత ఆ రెండుకట్ట లున్నై. ఆ కట్టలేమి టంటే యిందాక మనం చెప్పిన కామక్రోధ లోభమద మాత్సర్యాలూ, వాటికి సంబంధించిన విషయాలూ, బుద్ధియొక్క pro-jection చేత వచ్చే విద్యలూ, దాని చేత వచ్చే చంద్రలోకానికి పోదామనే టటువంటి వాంఛలూ–యిదంతా కూడా comprehensive గా ఒకటే mould వెంట వెళ్తోంది. ఆ mould ని దాటిపోవటం లేదు. ఎందు చేత పోవటంలే దంటే ఆ energy యొక్క లక్షణం అంతే! ఆ water యొక్క ప్రవర్తన అంతే. ఎట్లా అయితే ఆ water అట్లాగే వెళ్ళుందో యిదీ అట్లాగే వెళ్తోంది. యింకోవిధంగా దాటి పోదు అది ఎంత దాటి పోయినా, దాటి పోయినట్లు తాత్కాలికంగా మనకు కని పిస్తుంది. తప్ప it is always with in these desires.

కామమున్న దను కోమ్మా. ఉదాహారణకు తీసుకొందాం. కామం ఎక్కడకు పోతుంది? ఎంతదూరం పోతుంది? నేను రామాయణం వ్రాశాను. రావణుడు సీత నెత్తుకు పోతుంటే 'ఒరేయ్, అందగత్తె కోసం నువ్వు ప్రయత్నిస్తున్నావు. అందగత్తెలు అనంతకాలములం దున్నారు. వర్తమాన కాలమునందు ఒకానొక దేశ మందు ఒక అందగత్తెతో రమిద్దా మని వుంది నీకు. అందగత్తె లందరూ నీకులభ్య

చూతారా? సాధ్యం కాదు. భవిష్యత్ కాలంలో వున్న అందగత్తెలు నీకు అందరు. పూర్వకాలంలో వున్న అందగత్తెలు అందరు. కనక అందగత్తె కావాలన్నమాట కర్థంలేదు. కాబట్టి ఒకానొక స్త్రీయందు రమించుము. ఎందుకంటే యీరమణ మనేది జీవలక్షణంలో వుంది గనుక. ఆజీవలక్షణాని కానియమంచేస్తే ఆనియమం ఏంచేస్తుందీ, యీ desire ని తీసేసేందుకు సాధన మౌతుంది. పైగా, చమత్కారంగా, నీ desire ని increase చెయ్యదు. Because it is nothing but a projection Projection of Maya. నీమాయని చంపటానికి దాని కదే మందు. నీవు దానిని పెంచావనుకో. ఎంతదూరం పెంచుతావు? ఎంతదూరం పెంచినా భూత భవిష్యత్ వర్తమానములలో నున్నటువంటి అసంఖ్యాకలైన స్త్రీలయం దున్నటువంటి భావము అనుకుంటే వారందరితో నీ కెప్పుడూ సంపర్కం లేదు. It is denied to you. It is beyond the scope of a particular individual soul to embrace all the most beautiful women of all times and climes.

వ : అసలు రావణుడు ఆమెను 'అందగత్తె' అనుకోకుండా 'ఆమె' అనుకున్నా డేమో నండి

వి : రామాయణం కాదిక్కడ! నేను స్త్రీ వాంఛకు ఉదాహరణకు తీసుకొచ్చానేతప్ప I am not speaking of Ramayana. వేరే అర్థం ఒస్తుంది అక్కడ. ఆ సీతయొక్క సౌందర్యమే వేరు. ఆమె లోకంలోవున్న సర్వ స్త్రీలయొక్క సమాహారభూతమైన లక్షణం గలిగిన పరమేశ్వరి గనుక. ఇక్కడి కక్కడికి సంబంధం లేదు. నేను వూరికే ఒక పురుషుడు స్త్రీగతమైన వాంఛ - దాన్ని గురించి మాట్లాడుతూ వూరికే సామాన్యంగా ఉదాహరణ తీసుకొచ్చాను. అంతేకాని అమ్మగారు గాదిక్కడ.

## కళాకారునికీ సామాన్యునికీ భేదం

వ : రచయిత లేక కళాకారుడు అయినవాడికిన్నీ సామాన్యుడికినీ వుండే భేద మేమిటి?

వి : ఎప్పుడైతే యీ మానవబుద్ధి బహిరాగతమైందో, యీ బహిరాగతమైనటువంటి చైతన్యమే గా- ఊహగా, సంకల్ప వికల్పాత్మకంగా, బుద్ధిపద్ధతిగా రకరకాలుగా వచ్చింది? అందులో ఒకటి సౌందర్యభావనా నిష్ఠంగా కూడా వచ్చింది. తేనెతుట్టెలో తేనెభాగమంతా కొంచెమే. తక్కిందంతా పురుగులే. అవన్నీ లేకపోతే యిది లేదు. అట్లాగే మానవునియొక్క ఊహ వున్నదే ఆవూహలోనే ఒక దేశమునందు సౌందర్యజ్ఞానం, ఒక దేశమునందు సాహిత్యం, ఇంకొక దేశమునందు పరమేశ్వర భావం, ఇంకొక దానియందు విచారణ, ఇంకొక దానియందు లౌకిక ప్రవృత్తి - యిలా భిన్న భిన్నమైన pockets గా ఉన్నటువంటి ఒకానొక complete thing మనస్సు.

వ : అందరి మనస్సులూ అంతేనా?

వి : అంతే ఇందులో ఒకానొక మనస్సులో సౌందర్యజిజ్ఞాసకూడా వుంటుంది. ఈ సౌందర్యజిజ్ఞాస వుండట మంటే మనోలక్షణం. That is part and parcel of the mind, of that which makes the mind. అ దెటువంటి దంటే అది develop అయితే యీ mind యొక్క తక్కిన స్వరూపంలో వుండే సహజలక్షణం వుండే అదంతా comprehend చెయ్యడానికి తగినటువంటి శక్తివచ్చే లక్షణం దాని కుంది. ఆ సౌందర్య జ్ఞానంలో వుంది.

వ : పరమేశ్వరజ్ఞానంలో అంటే సరేకాని సౌందర్యజ్ఞానంలో అంటే - అదెలాగండి?

వి : సౌందర్యం అంటే ఏబుద్ధిచేతనైతే ఒకానొక దానియందలి ఒకానొక వైశిష్ట్యం మనకి పరమప్రియంగా వుంది అని అనుకుంటామో అది సౌందర్యం. దేనిచేత వాడు తృప్తిపడుతున్నాడో, లౌకికేతరమైన తృప్తి దేనినిచూచి పొందుతున్నాడో ఆ లక్షణం లోపల వున్నది. దానికి సహజమైన లక్షణం అది. అదీ సౌందర్య మంటే It differs with men. ఇంతలావుపెదవులుంటే నీగ్రో వాళ్లలో సౌందర్యం. ముక్కు లేకపోతే చైనావాళ్ళకు సౌందర్యం. ఆర్యదేశస్థులకు ముక్కుచాలావుంటే సౌందర్యం. తెల్లగావుంటే యూరోపియనులకి సౌందర్యం. ఒక మోస్తరు చక్కని ఛాయవుంటే మనకు సౌందర్యం. కనక సౌందర్యానికి definition లేదు. ఇది అందంగావుంది అనుకోవటమే సౌందర్యం. అట్లా అనుకోవడం కూడా it depends upon many things of a particular soul which is born under particular circumstances in a particular vicinity and place. ఇది independent మళ్ళీ. ఆసౌందర్య భావనకు ఒక శక్తి వున్నది. అది గనక వృద్ధిపొందితే, ఏపదార్థమైతే యిలా వస్తోందో దానియొక్క దర్శనం జరుగుతుంది. ఆ లక్షణం దానియందువున్నది. ఎంచేతనంటే దానియొక్క పరమప్రియమైనది గదా అది.

సౌందర్యంఅంటే... అసలు ఈజీవుడు ఎందుకొచ్చాడు? ఒకానొక ఇష్టం చెల్లించుకునేందుకుగదా వచ్చాడు? వీడియొక్క విషయనిష్ఠముకాని ఇష్టము ఒకటుంది.

( ప్రక్క పుటలో చూడుడు ).

# సుఖినో భవన్తు

– డా॥ అయ్యగారి నరసింహమూర్తి, ఎం. ఏ; పిహెచ్. డి.

సిరి సంపదలతోడ చెలువారు దేశంబు
దేవతల్ వసియించు దివ్యభూమి
సంగీత సాహిత్య సమరరంగంబుల
వర సంతతిని గన్న వజ్రభూమి
సకల విద్యలకును సర్వోపదేష్టగా
రాణకెక్కిన యట్టి రమ్యభూమి
పలుమతమ్ముల తోడ పలుజాతులం గూడి
మధుమాస మన నొప్పు మహితభూమి

కాల వశమున నది పరపాలనమున
పెక్కు ఇక్కట్టులకు లొంగి యుక్కుదక్కి
హింస యనునది లేక యహింస తోడ
నందె స్వాతంత్ర్య మని ముదమందు రోజు.

జయ జయ భారత జననీ!
జయజయ ఓ పుణ్యధాత్రి! జయమగును సదా
జయ జయ త్రివర్ణకేతూ!
జయ జయ మాస్వప్న ఫలమ జగదాధారా!

మట్టియూడల మాదిరి; ఇట్టిపరుగు
రీతి 'అవినీతి' దేశాన వృద్ధియయ్యె
పాప సమకట్టం జాలిన కాపులేడు
బండి యూకల పగిదిగా బ్రతుకు మారె.

* పీడె దాస్యము దేశాన; వేశ్యమాత
కవలె ధనదాహమది హెచ్చె కవలయమున
మమత సమసెను జనులందు మాయ హెచ్చె
చిత్ర చిత్రముగద; భువి జీవితమ్ము
జంత్రముల చందమై పోయె జనులకిపుడు

* స్వాతంత్ర్య మది రాగ స్వార్థమే పెరిగెను
నిస్స్వార్థ తత్త్వము నీరుకారె
స్వాతంత్ర్య మది వచ్చె నీతి నీమంబులే
అణగారి పోయెనే యాశలేక
స్వాతంత్ర్య మది వచ్చె జాతివైరము హెచ్చె
వంచనే ఘనతగా నెంచబడియె
స్వాతంత్ర మది వచ్చె ఖ్యాతి సుమంబులు
వాడివత్తలు నయ్యె వసుధలోన

చదువు సంధ్యల యందె వంచన పెరిగెను
మంచి యన్నది జనతలో మాసిపోయె
నేతిబీరకాయల రీతి ఖ్యాతి గలుగు
సభలు సన్మానములు నేడు చాల గలిగి
పలు తెలుంగుల దేశము భ్రష్టమయ్యె.

* ధర్మయుతమైన కర్మము ధాత్రిలోన
నడక సాగింపవలె నింక నాల్గుకాళ్ళ
సర్వజనముల సుఖమెనా నాసౌఖ్య మనుచు
ప్రతిన బూనుచు జనులింక బ్రతుకు టొప్పు.

వ : విషయనిష్ఠముకాని యిష్టము ఎట్లానండి ? ఇష్టము విషయనిష్ఠము అవుతున్నదికదా.

వి : ఎట్లానంటే విషయనిష్ఠముగా యిష్టము ఒకటి project అయింది. అసలు ఇష్టము అనే టటువంటి Quality ఒకటున్నదక్కడ. ఆ Quality యొక్క అసలు స్వరూపం మనస్సు. ఆ మనస్సుయొక్క projection భార్యయందు, పిల్లలయందు, డబ్బునందు, యిష్టములు. వీటన్నిటి వెనకా యిష్టమనే గుణం ఒకటున్నది. ఆ యిష్టము యొక్క కొంత purified state లో సౌందర్యంవుంది. అక్కడుంది సౌందర్యం. దానియందు concentrate చేసేప్పటికీ ఏమవుతోంది. ఏదైతే యిష్టమనే భావంతో భిన్నవిషయములందు ప్రవర్తిస్తోందో, యీతక్కిన యిష్టములు యిష్టములుకావు. యథార్థమైన యిష్టము యొక్క స్వస్వరూపం అది. స్వస్వరూపజ్ఞానము ఆ యిష్టమనే భావానికి కలుగుతోంది. అంటే ఏమిటీ, సరిగ్గా the real domain of the mind లోకి వెళ్తున్నాడు వాడు ఈ mind యొక్క యితర projections they are unreal grounds. ఆ సౌందర్యమనేది real ground. ఎంచేతనంటే నిరాధారమైన యిష్టం కనక.

వ : ఒకవేళ ఆధారం వుంటేనండి ?

వి : ఆధారంవుంటే విషయి అవుతుంది.

—*—

# డిగ్రీ తరగతి క్రొత్త పుస్తకాలు

## 1978 - 79 నోట్సు

1st YEAR

| | | | | |
|---|---|---|---|---|
| * 1 | ఖడ్గనారాయణము | బి. ఏ | మోడరన్ పొయెట్రీ | 3 — 00 |
| * 2 | సాహితీ సాక్షాత్కారము | ,, | ప్రోజు | 3 — 50 |
| * 3 | మహాసేనాని | ,, | నాన్ డిటైల్డు | 2 — 75 |
| * 4 | పట్ఫుది | బి. కాం | ప్రోజు | 7 — 00 |
| * 5 | నాయకరాజపర్వము | ,, | మోడరన్ పొయెట్రీ | |
| * 6 | రమణీ ప్రియదూతిక | ,, | నాన్ డిటైల్డు | 2 — 75 |
| * 7 | ఆంధ్రప్రశస్తి | బి.ఎస్. సి | మోడరన్ పొయెట్రీ | 3 — 00 |
| * 8 | మన సంస్కృతి - మన సాహితి | ,, | ప్రోజు | 3 — 50 |

2nd YEAR

| | | | | |
|---|---|---|---|---|
| * 9 | సావిత్ర్యుపాఖ్యానము | బి. ఏ. | ఓల్డు పొయెట్రీ With TEXT | 4 — 00 |
| *10 | స్వప్నవాసవదత్తము | ,, | క్లాసికల్ డ్రామా | 6 — 00 |
| *11 | సుభద్ర | ,, | మోడరన్ డ్రామా | |
| *12 | ఖడ్గనారాయణము Same as 1 Year | ,, | మోడరన్ పొయెట్రీ | 3 — 00 |
| *13 | సౌపర్ణోపాఖ్యానము | బి. కాం | ఓల్డు పొయెట్రీ With TEXT | 7 — 00 |
| *14 | నాయకరాజ పర్వము Same as I Year | ,, | మోడరన్ పొయెట్రీ | |
| *15 | ప్రతిమ | ,, | క్లాసికల్ డ్రామా | 3 — 00 |
| *16 | బలరామ విజయము | ,, | మోడరన్ డ్రామా | 3 — 00 |

* పై పుస్తకములన్నీ ముద్రణ పూర్తియై కాపీలు సిద్ధముగానున్నవి. X క్లాస్, ఇంటర్ తెలుగునోట్సు కూడ అన్నీ సిద్ధముగానున్నవి. కొన్నిరకముల స్టాకు తక్కువగా నున్నది! త్వరపడుట మంచిది.

**బి. వి. అండ్ కో.,**

6 - 7 - 8, ఇన్నీసుపేట

రాజమండ్రి - 1

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet,